

ఈత గీత

ఫొటో: నందగోపాల్ — హైదరాబాదు.

వచ్చేదే వినాయకచవితి




హాస్యరసభరితమైన

కథలు, నాటికలు, వ్యాసాలు,

ఛలోక్తులు, చిత్రాలు

ఇంకా ఎన్నో

★

నేడే మీప్రతి రిజర్వుచేసుకోండి!



సంవత్సర చందా
రు. 13—0—0
విడిపత్రిక 25 న.పై.




సచిత్రవారపత్రిక

**Founder: K. NAGESWARA RAO**

సంపుటము 51
సంచిక 51
**21-8-57**

హేవిళంబి శ్రావణం, బహుళ దశమి, బుధవారం


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
వయా సన్నార్ ఇంటర్నేషనల్ వారి
"పరదేశి" చిత్రంలో :
నర్గీస్

★

## అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు

# కంచె కోసం చేను!

ఒక ఊపు వచ్చింది.

ఆ ఊపులో ఏదో జరిగింది.

గాలి విసిరింది; వాన కురిసింది.

వాన వెలిసింది—గాలి విరిసింది.

ఫలితం! దారి మాత్రం బురదయింది!

ఇదీ జరిగిన విషయం. ఏదో జరుగుతుందనుకోవటం ప్రాణిధర్మం. ఆ ఆశ లేకపోతే, ప్రాణి ప్రాణంతో ఉండదు కదా! ఏదీ జరగదనే నమ్మకం ఉంటే, ఆ మరునాడే దర్భలు పరుచుకోవచ్చు; శక్తికలవారయితే పరిపించుకోవచ్చు.

అయ్యా, ఈ ప్రకారంగా ఉన్నది మన సాహిత్య వ్యవహారం. చిత్తగించారు కదూ!

పరిషత్తు ఏర్పడిందంటే ఏర్పడిందన్నారు.

గాడిదగుడ్డు—ఏమిటయ్యా ఏర్పడ్డదీ? అని ఉరిమారు అధికారులు.

"ఔను—ఏమీ ఏర్పడ్డట్టు మాకు తోచలేదు," అన్నారు ప్రభుత్వానికి కాకా పట్టే బాకా సాహేబులు.

వందిమాగధుల్నీ, వైతాళికుల్నీ సృష్టించిన కవిగాడు కాస్సేపు తనే ఆ రెండూ కాలేడాయేమిటి?

కాలేకేం!

అయి, అయానని వాయించుకున్నాడు.

ఈ సందర్భంలో నరికి బారెడంలో రాజధానీగౌరవాన్ని కోల్పోయిన బెజవాడ పేరింటి గోపాలరెడ్డిగారు ప్రభుత్వం వెలకొల్పే 'ఎకాడమీ'కి అధ్యక్షులయారు. ప్రజల పరిషత్తు ప్రసాదించిన ఉపాధ్యక్షపదవి సంగతి ఏం చేశారో తెలీదు. అయినా ప్రభువులు ప్రభువులే గందా!

ఇతఃపూర్వం విశ్వనాథ సత్యనారాయణగారు ఒక చిత్రమయిన ప్రకటన చేశారు. ఆయన తెలుగువాడు. పదహారణాల తెలుగువాడు! (నయా పైసాలు వచ్చాక ఈ పదహారణాలవారిని ఏ మనాలో విశ్రాంతిలో ఉన్న మాజీ గవర్నరు పట్టాభిగారు మనవి చేశారు కాదు!)

విశ్వనాథ సత్యనారాయణ ధ్వన్యధ్వానపాయ్యే తెలుగు కవి. వ్యంగ్యం, వక్రోక్తి లేనివాడు తెలుగు కవివాడు. మాట్లాడేటప్పుడు చమత్కారం, ఛలోక్తి విసరకుండా మరీ చప్పిడిపిండిలా మాట్లాడే వాడిలో తెలుగుతనం లేదన్న విషయం ఎరిగిన, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ చేసిన ప్రకటన హేమాహేమీలకే అర్థం కాలేదు. అర్థం కాకనే, ప్రభుత్వం పరిషత్తుని ఏర్పరచాలన్నారు.

సందేహం లేదు శ్రీ విశ్వనాథ నిజం చెప్పాడు. లేనిదాతకంటె ఉన్న లోభి నయం. ఎంత బాధతో అన్నారో ఆయన. ఎందరికి తెలుస్తుందా హృదయవేదన?

* * *

ఈ పూర్వరంగం ఇలా ఉండగా పరమ సౌమ్యస్వరూపుడయిన రాజేంద్రబాబుగారు ఆంధ్రప్రదేశ్ రాజధానీనగరానికి విజయం చేసి ఉన్న సందర్భంలో ఈ ఎకాడమీ ప్రారంభించిపోతేనే బావుంటుందని ప్రభువులకు తోచింది. ప్రభువులు ప్రకటించారు. రాష్ట్రపతి దానికి మొన్నీమధ్య ప్రారంభోత్సవం చేశారు. పత్రికలు ప్రముఖంగా కాకపోయినా ముఖపుటలలో వేయకపోయినా మొత్తంమీద ప్రజల కందజేశాయి. ఈ సందర్భంలో పెద్దల కొక మనవి.

అయితే స్వామీ!

చేను పెరుగుతోందని కనక కంచె వేస్తామా? కంచె పెరిగిందని చేను వేస్తామా? ఒక్కసారి ఆలోచించండి!

ప్రజలకోసం ప్రభుత్వమా?

ప్రభుత్వం కోసం ప్రజలా?

ప్రజలతో నిత్యసంబంధంకల ప్రజలలో సాహిత్యాభిరుచికలకొందరు ప్రజలు ఏర్పరచిన అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తుని వీరు గుర్తించి దానికి తగిన సహాకారం చేయక, ఈ కొత్త ఎకాడమీ ఎందుకు స్థాపించవలసివచ్చిందో చెప్తారా?

ఒకవేళ ఏర్పడ్డ పరిషత్తు అందరికీ ప్రాతినిధ్యం వహించకపోతే, ప్రభుత్వం సర్వ సారస్వతేయులకూ ప్రాతినిధ్యం ఇచ్చి స్వర్ణ సింహాసనాలు వేయిస్తుందేమో-అధికారులకు అనుపల్లవి పాడేవారయినా తెలుపుతే సంతోషం.

—"దీక్షితులు"



మృదంగకేసరి విద్వాన్ శ్రీ వారణాసి ఘంటయ్యశాస్త్రి ఆగస్టు 1న తమ 62 ఏట మరణించారు. శ్రీ ఘంటయ్య శాస్త్రి, మృదంగవాద్యంలో ప్రజ్ఞావంతులు. అన్నగారైన బ్రహ్మయ్యశాస్త్రివద్ద విద్య నేర్చిన పిదప, తోట్లవల్లూరులో శ్రీ శివలెంక వీరయ్య అయ్యవార్లంగారివద్ద శాస్త్రాభ్యాసం చేసి తర్వాత కుంభకోణములో శ్రీ మృదంగం కోదండరామ అయ్యర్ వద్ద విద్యకు మెరుగులు దిద్దుకొన్నారు. వాద్యము వినిపించి పండితపామర ప్రశంసలు సంపాదించారు. మద్రాసులో శ్రీ॥ శే॥ టైగర్ వరదాచారిగారి అధ్యక్షతను జరిగిన సన్మానంలో సువర్ణఘంటా కంకణం పొందారు. మృదంగ విద్వాంసులగు వారణాసి యజ్ఞనారాయణశాస్త్రి, వారణాస్త్రి గోపాలకృష్ణయ్య, అట్లూరి వెంకటేశ్వరరావు చౌదరి, రావి గోపాలకృష్ణయ్య, ధర్మాల రామమూర్తి, కమలనాథం, వారణాసి వీర రాఘవశర్మగారలు వీరి శిష్యులే.

# ★ మంగళగౌరి ★

సోఫాలూ, కుషన్లూ అందంగా అలంకరించి, ఆధునికంగా అమర్చిన ఇల్లు చూడగానే "వాళ్లిల్లు ఎంచక్కాగా దొరలిల్లులాగా అలంకరించే" రని చెప్పినట్టుగానే, ముంగిట కల్లాపుజల్లి, ముగ్గుపెట్టి, క్రిందిగుమ్మానికి చిగురుజల్లి మీదిగుమ్మానికి తోరణం కట్టిన గడప చూడగానే 'ఆ గడప, కలకలలాడుతూ సిరులొలుకుతూవుం'దని చెప్పడం కూడా పరిపాటే.

నిజమే మరి; పాడుబడ్డ గడపచూస్తే, చుట్టాలు చూడరారు – పక్కాలు పలకరించరారు – మిత్రులు మాటాడరారు – విరోధులు విహితానికి రారు – ఆఖరుకి అశుభమనే తలంపుతో బిచ్చగాళ్ళు బిచ్చమెత్తడానికి కూడా ఆగడపఛాయలకేనా రారు. అంగువల్ల గడప పాడుబడకుండా పాటుబడుతూ వుండాలనుకుంటారు, మన ఇళ్ళల్లో ఆడకూతుళ్ళు. కాని, ఏపనైనా వూరికే చెయ్యమంటే, ఎవరైనా చేస్తారా? ఏదో ఒక మిష, నెపం అంటూ వుండాలిగాని. అలా మిష, నెపం కూడిరావడానికే నోములూ, వ్రతాలు మన పెద్దలు ఉద్దేశించేరేమొ!

అయితే ఇలా ఎన్ని వ్రతాలున్నప్పటికీ, ఇవన్నీ ఆచరించుదా మనుకున్నప్పటికీ, ఇంకా కొద్దిరోజులు వూరికే ఉంటారేమో అన్న తలంపుతో పండుగనీ, పబ్బమనీ, పెళ్ళనీ, వడుగనీ, ఇవేవీకాకపోతే ఆఖరుకి – అన్నపిల్లల్నిగాని, తమ్ముడుపిల్లల్నిగాని, అప్పపిల్లల్నిగాని, చెల్లెలిపిల్లల్నిగాని – పెళ్ళికొడుకుని చెయ్యడమనీ, పెళ్ళికూతుర్ని చెయ్యడమనీ లాంఛనాలు జరిపించడం, ఇలా ఏదో ఒక నెపంతో ఇంటిగడపని అలంకరించడం మన ఇళ్ళలో మామూలు.

ఇలా ఉద్దేశించిన నోములూ, వ్రతాల వల్లనేనా, ఏటిపొడుగునా ఆచరించడానికి వీలవుతుందా అనుకుంటే, వీటిలో వారం ప్రాధాన్యంగా కలవి కొన్నైతే, తిథి ప్రాధాన్యంగా గలవి కొన్ని; నక్షత్రం ప్రాధాన్యమైనవి కొన్నయితే, తిథి వార

భారవీ కళ్యాణి

నక్షత్రాలు మూడూ ప్రాధాన్యమైనవి కొన్ని; ఇంతేకాకుండా, తిథి వార నక్షత్రాలతోబాటు మాసం ప్రాధాన్యం గాగలవి మరికొన్ని.

ఈ ప్రకారంగా మనవాళ్ళు పాటిస్తూ ఆచరించే నోములూ, వ్రతాలు మొత్తం 245 వున్నాయి. వీటిలో 'శ్రావణ మంగళవారం' 'శ్రావణ శుక్రవారం', లేక వరలక్ష్మీవ్రతం అనే వ్రతాలు శ్రావణమాసములో ఆచరిస్తారు. ఈ రెండు వ్రతాలలో 'శ్రావణ శుక్రవారం' లేక వరలక్ష్మీవ్రతం అనే దానిని శ్రావణమాసములో పౌర్ణమికి ముందు వచ్చే శుక్రవారంనాడు చేస్తారు. ఆరోజు వీలుకానప్పుడు ఆతరువాత శుక్రవారంనాడు చేస్తారు. ఈ వ్రతాన్ని పెళ్ళయిన యేడు మొదలుకొని ప్రతిసంవత్సరం సువాసినులందరూ ఆచరిస్తారు.

ఈ వరలక్ష్మీవ్రతానికి కలశంపెట్టి, కలశంమీద మామిడాకు కొబ్బరికాయ పెట్టి, ఆ కొబ్బరికాయకి బొట్టుపెట్టి పూజ చేస్తారు. కొంతమంది మాత్రం కంఠంవరకూ వున్న వరలక్ష్మీప్రతిమను కలశంమీద పెట్టి దానికి బొట్టు కాటుక మొదలైన అలంకారాలన్నీ చేసి పూజచేస్తారు. ఎవరెలా పూజచేసినప్పటికీ, తొమ్మిది పిండివంటలు చేసి నైవేద్యం పెడ్తారు. ఇంకా కొందరు కొత్తకోడళ్లు పెళ్లయిన ఏడు పూజ చేసుకుంటున్నట్లయితే పట్టుచీరలూ, బంగారు కాసులు, నగలూ నాణాలతో పూజచేయించి అవన్నీ కొత్తకోడలికి కట్నంగా ఇస్తారు.

అల్లుడికి పంపిన ఆషాఢ తిరూ అందుకొని, కోడల్ని వరలక్ష్మీవ్రతానికి పిల్చుకు వెళ్తారు. అప్పుడు కొత్తకోడలిచేత కాసులు చీరలూ మొదలైనవాటితో వరలక్ష్మీవ్రతం చేయించి శ్రావణపట్టే పెట్టి పుట్టింటికి పంపించుతారు. కనుకనే ఆషాఢతిరూ అందుకోడం, శ్రావణపట్టే అంపించడం లాంటి వేడుకలు జరిపించడానికి గాని, పొందడానికి గాని మూలనున్న ముసలమ్మలు ఎక్కువ సంబరపడతారు. అందువల్ల శ్రావణమాసం వచ్చిందంటే, మూలనున్న ముసలమ్మలకి మురిపాలెక్కువ.

ఈ వరలక్ష్మీవ్రతానికి పూజానైవేద్యాలయేక పాటరూపంలో వున్న కథ చెప్పుకుని, ఆ కథాక్షితలు నెత్తిమీద జల్లుకుంటారు.

## మంగళవారం

పెళ్ళయిన ఆడపిల్లలందరూ పెళ్ళయిన ఏడు మొదలుకొని, ఐదు సంవత్సరాలు ఆచరించే నోము, ఇది. ఈ నోము శ్రావణమాసంలో ప్రతి మంగళవారం ఆచరిస్తారు. వూళ్లో తెలిసిన బంధుమిత్రులందరినీ, తొలిరోజు సాయంత్రమే బయలుదేరి వెళ్లి పేరంటం పిలిచి, మంగళవారంనాడు ధూపదీప నైవేద్యాలతో మంగళగౌరి పూజ చేస్తారు. ఆ తర్వాత జ్యోతులు వెలిగించి 'శ్రావణ మంగళవారాల కథ'పాట పాడుతూ వుండగా, ఆ జ్యోతులమీద గరిటె కుడక బోర్లించి కాటుక పారిస్తారు. ఈ జ్యోతులకి వరిపిండిలో చేసిన కుందులలో నేతితో దీపాలు పెడ్తారు. పాట పూర్తి అయిన తరువాత అయిదుగురు ముత్తయిదువలకి

ఖ్యంగా వాయనం ఇస్తారు. ఈ అయిదింటిలో అత్తవారి వాయనం ఒకటి. ఈ వాయనాలలో వెలిగించిన జ్యోతుల కుందులు కూడా పెడతారు. అవి తింటేను, కాటుక పెట్టుకుంటేను వివాహితనం, కడుపుచలవ కలుగుతాయని ప్రతీతి. ఆ రోజు సాయంత్రం వచ్చిన పేరంటాళ్ళందరికీ కాళ్ళకి పసుపురాసి, పారాణిపెట్టి, బొట్టు, కాటుక, గంధం ఇచ్చి తాంబూలంతో వాయనం ఇస్తారు. ఇలా ప్రతివారం చేస్తూ ఐదు సంవత్సరాలపాటు ఆచరిస్తారు. శ్రావణ మాసంలో వచ్చే అన్ని మంగళవారాలూ పూజచేసికోగలుగుతే, చాలా గొప్ప. ముఖ్యంగా తొలివారం, ఆఖరివారం సాధ్యపడి పూజ జరిగినట్లయితే ఆ ఏడు లెక్కలోకి వస్తుంది; లేకపోతే లెక్కలోకి రాదు. అందువల్ల చాలామంది పెళ్ళయిన పదిపన్నెండేళ్ళ వరకూ ఈ నోము నోచుకుంటూ వుంటారు. అయితే అప్పటికే చాలా మందికి ఈడు మించిపోయి వుంటుంది. కనుక ఇంట్లో వున్న చిన్న పిల్లల్ని పేరంటం పిలిచేందుకు పంపించి వారిచేత నోము నోపిస్తూ తాము కూడా నోసుకుంటూంటారు. అందువల్లనే మన ఇళ్ళలో ఆడపిల్లలకి సాధారణంగా అయిదు సంవత్సరాలు నిండి నది మొదలుకొని పెళ్ళయేవరకూ ఈ 'శ్రావణ మంగళ వారాలు' కన్నె నోములు నోపిస్తూండడం ఆచారమయింది.

'ఈ శ్రావణమంగళవారాలు' పాటలో వున్న కథ ఏమిటంటే :

సకలసంపదలూ కలిగినప్పటికీ సంతానం లేని చింతచేత, సతీసమేతంగా ఒకరాజు పరమేశ్వరుణ్ని గురించి తపసు చేస్తున్నాడు.

"వారితపసుకి మెచ్చి పరమేశుడప్పుడు|
ఇహపరంబులు వీరి కిత్తుననుచు|
లింగంబు తాను ఒక జంగమాకారమై"
రాచనగరుకి వచ్చేడు.
"మేడపైనుండి తా దిగివచ్చి యాసతి
బంగారు పళ్లెములో నాణెములను
పడతి తేగా జూచి పరమేశు డప్పుడే
వినుమంబు తొలకపోయె నంత
అతివ తనమనసులో ఆశ్చర్యపడుచునే"
రాజుతో సంగతంతా చెప్పింది. సతీ పతులిద్దరూ ఆలోచించుకుని మరునాడు :
"అరుగుచాటుననుండి దాగి చూడంగానె
గంటల్లు మ్రోగుతూ వచ్చె శివుడు
వచ్చిన జంగమును పోనీక పట్టుకొని
ఇదియేమి కారణంబని యడిగిరి
పుత్రపౌత్రులు లేని మీ చేతిభిక్షమ్ము
హరహరా యంటరాదని పలికెను.
తమకేమి గతియనుచు సతిపతులు ఇద్దరు
సాష్టాంగ మెరిగిరి శివుని కపుడు
ఇస్తి నీకోవరం మెస్తినీహమ్మనుచు
స్త్రీజన్మమా పురుషజన్మమునైను
సత్యవతియైనట్టి ధర్మవతినిత్తునా
పదహారు వర్షముల సుతునిత్తునా."

అని అడిగేడు శివుడు. అందుకా సతిపతులు సంప్రతించుకుని విద్యోతనం లేని ఆడసంతుకంటె ఆయుషు లేని మగసంతే మేలు కనుక అదే కావాలని కోరుకున్నారు.

"ఊరికీ ముందర కాళికాగుడి వెనుక
చూతవృక్షమ్మన ఫలమున్నది
ఆ ఫలము తెచ్చుకొని భుజియింపు
మని పల్కి
అంతర్ధానమ్మయ్యె ఆ దేవుడు
ఆ రాజు హర్షమున ఆ వృక్షమును ఎక్కి
ఆ ఫలములన్నియును కోసితెచ్చి
అతివ ముందరవుంచి విప్పిచూడంగానె
ఒక్కటే ఫలముండె ఒప్పుగాను.
పరమేశు డిచ్చినా ఫలప్రాప్తి యింతేను
అధికఫలమెచ్చునా అతివ మనకు
అనుచు భుజియించగా అతివ గర్భము
నిల్చె
నవమాసములు నిండ నాతి కపుడు
సూర్యతేజస్సున పుట్టిన సుతునికి
పుత్రోత్సవము పంచె పుణ్యశాలి.
సంతోషమున రాజు నామకరణం వ్రాసి
నారాయణా యనుచు పేరుపెటి
దృష్టి తగులాకుండ చుక్క బొట్టూ పెట్టి
శిరసంటి తొట్టెలో నుంచి రపుడు
ఆటప్రాయమునాడు ఆట తోడుసులు
తోడిగి
పాటప్రాయమునాడు పాట చూసి"

ఇలా అల్లారు ముద్దుగా పెరుగుతున్న బాలుణ్ణి చూసినకొద్దీ ఆ రాజ దంపతులకి దుఃఖం పొర్లుకురాసాగింది. తీర్థయాత్రలు చేసినట్లయితే, దోవలో యెవరి మహాత్మ్యం వల్లనైనా కుర్రవాడు ఆయుష్మంతుడు కావచ్చుననే ఆశతో ఆ రాజదంపతులు, మేనమామను తోడిచ్చి కుర్రవాడిని కాశికి పంపించేరు. అలా బయలుదేరిన అల్లుడు, మామా కాశీ పోతూ ఆ దరిదాపుల్లో వున్న పూలవనానికి చేరుకున్నారు.

"ఆవనానికిపోయి చాల బడలికచేత
పరమేశ్వరాజ్ఞచే నిలిచిరదట"
అంతలో,
"శ్రావణామాసాన మంగళవారాన
మంగళాగౌరిని పూజింతురు.
అంగనలు తామరలుపూలుకోయుచు రాగ
రాజుకూతురు వచ్చె రమణివెంట
ముదితలందరు కూడి ముండతిట్లాడుకొని
వనముపై పువ్వులు జల్లుకొనిరి.
సత్యవతి యాకన్య జల్లినాపువ్వులు
యేకొమ్మ పువ్వు లాకొమ్మనంటె."

ఇదంతా చూస్తూవున్న ఆ కుర్రవాని మేనమామ ఆ రాజు కూతురు గొప్ప మహిమగలదిగా భావించేడు. కుర్రవానికి గనుక చిన్నదాన్నిచ్చి పెళ్ళిచేస్తే, ఆ చిన్నదాని మూలంగా కుర్రవాడు చిరంజీవి కావచ్చునని తలపోసి, వెంటనే అందుకుతగిన ఏర్పాట్లు చేసేడు.

ఆ రాత్రి నగరిలో ఆ కన్యకావరుల
తోడుకొనిపోయి మధుపర్కమిడిరి
తా ధర్మశాస్త్రిలు అన్నియును గావించి
లాజహోమం వ్రేల్చె రమణితోను
సప్తర్షులకు తాను సంభ్రమమ్మున మ్రొక్కి
నగరు ప్రవేశించె నాతితోను
ముత్యాలు కూర్చిన బంగారు చాకలో
పట్టెమంచము వాల్చి పరుపు పరచి
తూగుటుయ్యాలలో దంపతులు ఇద్దరు
పవళించి నిద్దుర శాయగాను
కాలమృత్యువు వచ్చి సర్పమాకారమై
బాలుణ్ణి కరవంగ వచ్చి నిలచె
మంగళాగౌరమ్మ మగువ స్వప్నమునందు
నీ పతికి గండసమయం బనియెను
మాంగళ్యవతి నిద్ర శీఘ్రాన మేలుకొని
కన్నులను విప్పి తా కలయజూచి

(9-వ పేజీ చూడండి)

# మంగళగౌరి

(5-వ పేజీ తరువాయి)

కృష్ణసర్పము జూచి కిలకిలా నవ్వుచు
సువర్ణకలశను తెచ్చి నుంచె నపుడు
బాల భక్తికి మెచ్చి నాగేంద్రుడప్పుడు
కలశంబులో ప్రవేశింపగాను
చుట్టచుట్టుక యతడు పవళించియుండంగ
ప్రదక్షిణ నమస్కారంబు తా జేసెను
ముత్యాలు కూర్చిన రవికె తాను విడిచి
వాసెనా గట్టెను వనిత యపుడు."

అమ్మయ్య అనుకుని పతి వేపు చూసింది మాంగళ్యవతి – నిద్ర పోతున్నట్టున్నాడు. వాసెనకట్టిన కలశ వెలికెలో ఉంచుదామనుకుంది. కాని వెలికె అందలేదు. అప్పుడు—

"పతి తొడమీదను పాదమూని కలశ
వెలికెలో వేగముగ నుంచెనపుడు"
నిద్రపోతున్నట్లుగావున్న పెళ్ళికొడుకు
తా గమనించి తెల్లవారుఝామున మేన
మామతో జరిగిన విషయమంతా చెప్పేడు.
"తెల్లవారకముందె యెవరితో చెప్పకను
నేటి గండము మనకు గడిచెననుచు
అతి హర్షమును జెంది అల్లుడును మామయును
కాశిచేరగ వేగ కదలినారు.

అంతలో తెల్లవారగానే రాచనగరిలో పెండ్లికొడుకును కానక పోయేసరికి ఈ వార్త పైకి పొక్కనీకుండా, ఆ రాచదంపతులు మరో కుర్రవానిని తీసికొచ్చి పెండ్లికూతురితో పాటు ముత్యాలగద్దెమీద కూర్చోపెట్టేరు. అప్పుడు పెండ్లికూతురైన రాకుమార్తె:

తన ప్రక్కనుంచిన తరుణుణ్ణి తా జూచి
తనపతి గాడనుచు లేచిపోయె
లేచి మేడపైని కూర్చుండి చింతింప
జాణలైనట్టి యా చెలియలెల్ల
నేర్పుతో నితడే నీపతియని జెప్ప
కాడనుచు తా తెలిపి తల్లడిల్లె

ఎవరెన్నివిధాల చెప్పినా వినిపించుకోకుండా ఆ రాకుమార్తె తండ్రిని పిలిచి:-

నీవు సత్రంకట్టి నిజముగా నడిపితే
భక్తితో తాంబూలాలిస్తునేను.

అనిచెప్పి తాంబూలమిచ్చినప్పుడు తన పతిని చూపిస్తానని ప్రతిజ్ఞచేసి సంవత్సరం గడువు చెప్తుంది. అందుకా రాజుకూడా సరేనని:

"ముద్దుకూతురుమాట మోదముతో చెల్లించి
సాలకట్టించి సత్రము వేసెను."

ఇక్కడ ఇలావుండగా, ఆనాడు తెల్లవారుజామున బయలుదేరిన అల్లుడు, మామ

కాశిచేరియు వారు గంగస్నానంజేసి
కాలభైరవు దర్శనం చేసిరి
అన్నపూర్ణను చాల అతిభక్తి వేడుకొని
విశ్వేశ్వరుని గుడి దర్శించిరి
మణికర్ణికాదేవి తిరుదేవి దర్శించి
బిందుమాధవ దర్శనం చేసిరి
భాగీరథిని చాల భక్తితో వేడుకొని
తిరిగి మళ్ళిరి వారు సీమ కపుడు.

ఆ ప్రకారంగా ఒకఏడాదికాలం తీర్థయాత్రలు సేవించి ఆ అల్లుడు మామ తిరిగి వస్తూ దోవలో రాకుమార్తె పెట్టించిన సత్రం చేరుకున్నారు. అక్కడ వారిద్దరూ భోజనం చేసి పోబోతూ వుండగా రాజభటులు అటకాయించి, రాకుమార్తె చేత తాంబూలం పుచ్చుకొని వెళ్ళమని చెప్పేరు. అందుకు వారు నిరాకరించగా:

"అతిదేశి పరిదేశి విప్రులు రాజులు
భుజియించి తాంబులాలందగాను
మీరేల వోల్లరని పరిచారకులు వార్ని
తోడుకొనిపోయె రాజ సముఖమునకు

అప్పుడా రాజకుమార్తె తాంబూలమిస్తూ ఆ కుర్రాడి చెయ్యిపట్టుకుని ఇతడే నా పతి అని చెప్పింది. ఈ మాటలు విన్న పిల్లవాని మేనమామ 'దారినపోయేవాళ్ళని చూపి ఇతడే నాపతి అంటావేమిటి? నీ మాటలు నమ్మడానికి మేనా గుర్తులున్నవా' అని అడిగేడు. వెంటనే ఆ రాకుమార్తె ఆనాడు సర్పాన్ని వుంచిన సువర్ణకలశం తెచ్చి చూపించి, ఆరోజు జరిగిన వృత్తాంతమంతా విశదపరిచింది. కలశానికి కట్టిన వాసెన విప్పి చూడగా దానిలో సర్పం బంగారు పాముగా మారి వుంది. పిల్లవాడి తొడమీద పారాణి పాదం ఆనవాలుగా వుంది. ఆ వృత్తాంతం విని, ఆనవాళ్ళు చూచి అందరూ ఆశ్చర్యపడుతూ వుండగా పిల్లవాని మేనమామ జరిగినదంతా నిజమేనని, ఒక సంవత్సరం వ్రతంమూలంగా వెంటనే పిల్లవానిని తీర్థయాత్రలకి తీసికొని వెళ్ళేనని, హఠాత్తుగా వచ్చి ఆ రాకుమార్తె ఏనిమిటి అని చెప్పితే నమ్మడానికి వీలుండదేమోనని ఆనవాళ్లు అడిగినట్టు చెప్పేడు. ఇది విన్న రాకుమార్తె తలిదండ్రులు ఎంతో ఆనందంతో మళ్ళీ వాళ్ళిద్దరికీ పెళ్లిచేసి వైభవంగా సాగనంపారు. అక్కడ పిల్లవాని తలిదండ్రులు పుత్రవియోగంవల్ల కండ్లుపోయి వుంటారు. ఈ వధూవరులువెళ్ళి వారికి నమస్కరించగా రాకుమార్తె స్పర్శవల్ల వాళ్ళకి దృష్టివస్తుంది. ఆ రాచదంపతులు జరిగినదంతా తెలిసికొని పరమానందంతో కొడుకుని, కోడలిని దీవిస్తారు. ఆ తర్వాత 'మాకు పుత్రభిక్ష పెట్టిన పుణ్యశాలివి నీవు ఏ నోము నోచేవు, ఏ పూజ చేశావు' అని రాకుమార్తె నడుగగా "మంగళగౌరి" వ్రతం చేసేనని చెబుతుంది.

ఇది 'శ్రావణ మంగళవారాలు' కథ. నాటి నుంచి ప్రతి ఇంట్లోను పెండ్లయిన ఆడపిల్లలందరూ ఐదోతనంకోసం అయిదేళ్లు ఈ నోమునోచుకుంటూండడం ఆచారమయింది.

కొత్తకుండలోగాని, కొత్త చెంబులోగాని పదమూడు జొళ్లు అరిసెలుంచి కొత్త గుడ్డతో దానికి వాసెనకట్టి, ఆ వాసెనమీద చీర, రవికెలగుడ్డ—లక్కజోడు కుత్తిగంటు, మట్టె – మంగళసూత్రం తాంబూలంతో వుంచి పైటచెంగు వాటిమీద కప్పి పెండ్లివేళలో 'సప్తపది' దగ్గర పెళ్ళికూతురికి 'ఇస్తినమ్మ వాయనం' అని చెప్పి అందించడం ఈ నోముకి ఉద్యాపన. పెండ్లికూతురు కూడా పైటచెంగు మూసి వాయనం అందుకోవాలి. అయితే ఈ ఉద్యాపనకి కేవలం కొత్త కుండలో మూడు బెల్లంముక్కలు వుంచి వాసెనకట్టి మిగతా దినసులన్నిటితో పైన చెప్పినటుగా వాయనం ఇవ్వడం మాత్రం ద్రావిడాచారం.

ఈ 'శ్రావణశుక్రవారం' 'శ్రావణ మంగళవారం' నోములు మాంగళ్యం కోసం, సంపద సౌభాగ్యాలకోసం సువాసినులు ఆచరించేవి. ఈ వ్రతాలు మొదలుపెట్టి ఉల్లంఘన చేస్తే ఇహలోక బాధలు కల్గుతాయి; సక్రమంగా ఆచరించినట్లయితే, ఇహపరాలలో సౌఖ్యం కలుగుతుంది. 

# దాన వీర కర్ణుడు

కర్ణుడు లతామండపంలో నిల్చుని ఒక చేతిని అతివయ్యారంగా నడుంమీదా, మరొకచెయ్యి స్తంభానికి ఆనించివున్నాడు. మధ్య మధ్య కళ్లుమూస్తూ, తెరుస్తూ ఆలోచిస్తున్నాడు. నిజంగా నేను కుంతి కుమారుణ్ణేనా? లేక రాధ కుమారుణ్ణా? ఆ పరమాత్మ మాయలన్నీ ఎవరికేం తెలుస్తాయి? ఒక నిట్టూర్పు విడిచాడు.

"మహారాజా, బ్రాహ్మణుడెవరో వచ్చి ద్వారం దగ్గర నిలబడి వున్నారు. వారు మీ దర్శనాన్ని కోరుతున్నారు" అన్నాడు వినయంగా ప్రతీహారి.

కర్ణుని ముఖంమీద చిరునవ్వు నృత్యం చేసింది. అంతలోనే ఆ విశాల ఫాలభాగం మీద విషాదరేఖలు లీలగా గోచరించాయి. ఇంతలోనే కన్నుల్లో ఎక్కడలేని మార్దవం. మళ్ళీ ఒక చిన్న చిరునవ్వు నవ్వి "వెళ్లి ఆ మహాత్ముణ్ని లోపలికి తీసుకురా" అని ఆజ్ఞాపించాడు.

ఆ చిరునవ్వుకు కారణం, ఆ విషాద రేఖలకి కారణం ఏమిటో ఆయనకే తెలియాలి. "అదృష్టం అంటే నాదేగదా. ఆ మహాత్మునికి కూర్చునేందుకు ఈ రత్న ఖచిత సింహాసనం చాలుననుకుంటాను. ఆ మహామహుడి పాదాలు శుద్ధిచేసేందుకు ఈ బంగరు పళ్ళెరము చాలనుకుంటాను." అని పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు.

కొద్దిసేపటిలోనే కర్ణుడు కూర్చున్న స్థలం దగ్గరికి ఒక బ్రాహ్మణుడు వచ్చి నిలుచుండిపోయాడు. ఆయన పొడగరి కాదు; నేత్రాలు ఎర్రగా జ్యోతుల్లా ప్రకాశిస్తున్నాయి. వక్షస్థలంమీద తెల్లగా జందెం మెరుస్తూవుంది. మెడలో తులసి మాల, చేతిలో కమండలం ఆ బ్రాహ్మణునికి వింత శోభ నిస్తున్నాయి.

"దయచెయ్యండి. భూమిమీద దేవుని వంటివారు. హితవు కోరువారు. దయచేసి ఈ అల్పాసనముపై కూర్చోండి," అని వినయంగా చేతులుజోడించాడు, కర్ణుడు.

"కర్ణా, శుభమగుగాక; ఏమి నీమాటల తీరు. ఏమి నీ దీటు."

"స్వామీ! ఏమి మీ ఆజ్ఞ?"

"రాజా! ముందర నీవు నేనేది అడిగితే అది ఇస్తానని ప్రతిజ్ఞ చెయ్యి."

"బ్రాహ్మణోత్తమా! నేను మధ్యాహ్నం దాకా జపం చేస్తానని తెలియదా? ఈమధ్యలో ఏ బ్రాహ్మణుడొచ్చి ఏది అడిగినా తప్పక ఇస్తాను."

"రాజా! నీవిషయంలో నేను ఇటువంటివే చాలా వినివున్నాను. కాని నేను చాలాదూరంనుంచి వచ్చాను."

"అడగండి. మీకేదికావాలో"

"కోరికా? ఇట్లాచూడు. ఏమంత పెద్దది కాదు. చాలా చిన్న కోరిక. కానీ ఆ కోరిక తీరుతుందో తీరదోనని భయంగావుంది."

"అయ్యో! కర్ణుడు తన ప్రతిజ్ఞను భంగం చేసుకుంటాడని భయంగా వున్నదా?"

"ఆ, నిజంగా అదే భయం నాకు. నాయనా కర్ణా!"

"మీరు కర్ణుణ్ని గుర్తించలేకపోయారు. వినండి. ఏరోజునయితే కర్ణుడి ప్రతిజ్ఞ భంగం

## అద్దంకి శ్రీదేవి

అవుతుందో ఆరోజున సూర్యభగవానుడు పశ్చిమాన్ని వుదయిస్తాడు. ఇప్పుడు అడగండి."

"అడగనా? కానీ నాకు అడగకుండానే వెళ్లిపోవాలనిపిస్తోంది. నువ్వు సుఖంగా వుండు."

"కాదు, కాదు. సంతోషంగా అడగండి. సంకోచం ఏమాత్రంవద్దు మహానుభావా!"

"నాయనా కర్ణా! మంచిది. అడుగుతున్నాను. నీ సహజరక్షణమైన కవచకుండలాల్ని నాకియ్యి." ఇట్లా మాట్లాడుతూ వుండంగానే బ్రాహ్మణుని ముఖభంగిమలు తారుమారయి ఒంటినిండా చెమట పట్టింది.

కర్ణుడి ముఖంమీద హాస్యరేఖలు లతల్లా అల్లుకుపోయాయి. శరీరం రోమాంచితమైంది. నేటితో అయితే ఆయన తన జన్మను సార్థకం చేసుకుందామనుకున్నాడో ఆ కవచ కుండలాలుతీసి ఆ బ్రాహ్మణ యాచకునికి ఇచ్చేసాడు. కవచకుండలాలను తీయడం మూలకంగా కర్ణుడి శరీరమంతా రక్తపు దారలతో తడిసిపోసాగింది. ఆకాశంలో విహారంచేస్తున్న సూర్యుడిది చూడలేక నల్లటి మేఘంక్రింద దాక్కున్నాడు. లతామండపంలోవున్న పక్షులు అతిదీనంగా విలపించసాగాయి. లతలు పుష్పవృష్టినికురిపించాయి. బ్రాహ్మణుడు అత్యాశ్చర్యంతో కర్ణుణ్ని చూస్తున్నాడు.

"ఈ కవచకుండలాలు తీసికోండి, బ్రాహ్మణోత్తమా! వెనకవైపున నిల్చుంటారేమి? నా ఎదురుగా రండి."

"నా ఆరోగ్యం ఏమీ బాగులేదు రాజా! నన్ను పంపించెయ్యండి. నేను వాంఛించిన వస్తువును పొందాను. ఇప్పుడు నాకేం అక్కరలేదు."

బ్రాహ్మణుడు శెలవుతీసికొని ద్వారం వైపు వెళ్ళసాగాడు. కర్ణుడు బ్రాహ్మణుడు వెళ్ళినంతదూరం చూస్తూనే వున్నాడు. మనస్సులోని భక్తి పొంగగా చేతులు రెండుకలపి హృదయపూర్వకంగా నమస్కరించాడు. ఆ బ్రాహ్మణుడు కొద్దిదూరం వెళ్ళి వెనక్కితిరిగి కర్ణుడికేసి వాత్సల్యపూర్వకంగా చూస్తూ నిల్చున్నాడు.

"భూసురోత్తమా! నిల్చుండిపోయారేమి? ఇంకా ఏమన్నా కావాలా?" అన్నాడు కర్ణుడు.

"ఈ ద్వారం మూసేసివుంది." తన సమాధానం తనకే సమంజసంగా వినిపించలేదు. 'ఇదేమిటీ ఇల్లా సమాధానం చెప్పాను' అనుకున్నాడు మనస్సులోనే.

"నేను ఇక్కడనుంచి చూస్తూవున్నాను, ఆ ద్వారం తీసేవుంది. మిమ్మల్ని ఎవరూ అడ్డగించరు. మీరు నిస్సంశయంగా వెళ్లొచ్చు. వెళ్ళండి."

బ్రాహ్మణుడు రెండడుగులు ముందు కేసి మళ్ళీ వెనక్కి తిరిగాడు.

"ఎందుకని ఆగిపోయారు? మీరుసుఖంగా వెళ్ళొచ్చు" అన్నాడు కర్ణుడు—ఎప్పుడూ మొహంమీద తాండవించే చిరునవ్వుతోనే.

"కర్ణా, నా కాళ్లల్లో నడిచేందుకు కూడా శక్తి లేదిప్పుడు" అన్నాడు బ్రాహ్మణుడు అస్పష్టంగా.

"మీరు ఎక్కడికివెడదామన్నా నారథం తయారుగా వున్నది" అన్నాడు మృదువుగా కర్ణుడు.

ఆ కంఠం వసంతకాలంలో క్రొత్తగా చిగిర్చిన లేతమామిడిచెటచిగుళ్లుతిని మత్తెక్కిన కోయిల కంఠం ఎత్తి గానం చేసినట్టూ, అప్పుడే పూచిన మందారపువ్వులోని మకరందాన్ని గ్రోలి ఆనందంలోవున్న తుమ్మెద ఝుంకారం చేస్తున్నట్లు వినిపించసాగింది ఆ అపరిచిత బ్రాహ్మణుడికి.

కర్ణుడి నోటినుంచి రథం తీసుకురమ్మన్న ఆజ్ఞ పూర్తి కాకముందే అక్కడ ఒకరథం హాజరయింది. కాని బ్రాహ్మణుడు నిల్చున్న చోటనే వుండిపోయాడు.

"స్వామీ! ఇప్పుడు రథం తయారయింది, పదండి."



బ్రాహ్మణుడు రథంవైపు వెళ్ళబోదులు కర్ణునివైపు తనకే తెలియకుండానే నడిచాడు. మళ్ళా ఆయన కర్ణుడిదగ్గరకొచ్చి నిలబడిపోయాడు.

"ఏం స్వామీ! ఇంకా ఏమన్నా ఆజ్ఞ వున్నదా" అన్నాడు మృదుస్వరంతో.

"అవును ఒక ఆజ్ఞవున్నది. నువ్వు యేమయినా కోరుకో."

"నాకు మీ ఆశీర్వాదం చాలు. కాని మీరు నా ఎదుటకు రావటంలేదు. అది నా దురదృష్టం అనుకుంటున్నాను" అన్నాడు చిరునవ్వు నవ్వుతూ ప్రస్ఫుటంగా కర్ణుడు.

"కుమారా! దౌర్భాగ్యం నాదే నాయనా. నన్ను నువ్వు గుర్తించలేదు."

"నేను మిమ్మల్ని గుర్తించాను. తండ్రీ! తమరు అర్జునునికి తండ్రి అయిన ఇంద్రులు" అని సాష్టాంగంగా నమస్కారం చేశాడు.

"ఔ, నాయనా కర్ణా! ఆశ్చర్యమయిన విషయం. నేను ఇంద్రుడినని నీకెల్లా తెల్సు" అన్నాడు భయసంభ్రమాలతో ఇంద్రుడు.

"ఏవిధంగా మీరు అర్జునుని పూజ్య జనకులో అదేవిధంగా సూర్యనారాయణుడు నా జనకుడు. ఎట్లాఅయితే మీరు రాత్రింబగళ్ళు అర్జునునిగురించి చింతిస్తూ వుంటారో అట్లాగే నాతండ్రికూడా సర్వదా నన్నుగురించే చింతిస్తూవుంటారు. సీతాకోకచిలుకలు ఎప్పుడూ ఎట్లాఅయితే పువ్వుల్ని విడిచిపెట్టకుండా వుంటాయో అట్లాగే తల్లిదండ్రులు పిల్లల్ని విడవకుండావుంటారు. మీరు రేపు బ్రాహ్మణవేషంలోవచ్చి నా కవచకుండలాలు దానం ఇమ్మంటారని నా తండ్రి రాత్రే స్వప్నంలో కనబడి చెప్పారు" అన్నాడు విలాసంగా చెయ్యి వూపుతూ కర్ణుడు.

"కుమారా, కర్ణా, ఏంచెపుతున్నావు నువ్వు? నేను ఇంద్రుణ్ణి అని నీకు తెలుసు. ఇవి అర్జునుడికోసం తీసుకెడుతున్నానని నీకు తెలుసా?"

"ఇదంతా నా తండ్రి చెప్పేవున్నారు."

"కాని ఇవి మరి నాకు ఎందుకు ఇచ్చేస్తున్నావు? యుద్ధంలో గెలవాలని లేదా నీకు?"

"లేకేం? వున్నది. కానీ విజయం సంపాదించాలంటే ఈ కవచకుండలాలు మీకిచ్చేందుకు అనంగీకారం చూపాలి. ఆట ఆడినపుడు గెలవడం, ఓడడం వుంటుంది. అల్లాగే యుద్ధంలో జయాపజయాలు కూడా వుంటాయి. రెండు పక్షాలవారు గెలవాలన్నా రెండు పక్షాలువారూ ఓడాలన్నా అసంభవం. అటువంటప్పుడు మేం గెలిస్తే మంచిదే. కానీ ఓడినా నేనేమీ విచారపడనక్కరలేదనుకున్నాను. సుఖాలు వచ్చినప్పుడు సంతోషించి దుఃఖాలు వచ్చినప్పుడు విచారపడకూడదు. ఎక్కడయితే పాము వుంటుందో అక్కడ మణికూడా తప్పకుండా వుంటుంది. అల్లాగే రాత్రింబగళ్ళు, సుఖదుఃఖాలు, జయాపజయాలు కూడాను. ఇంకొక కారణం ఏమిటంటే, నేను కర్ణుణ్ణి. జపం చేసుకునే సమయంలో ఎవరయినా వచ్చి ఏదయినా అడిగితే ఖాళీ చేతులతో పంపకూడదని నా ప్రతిజ్ఞ. ఈ నా ప్రతిజ్ఞని కలలోగూడా భంగం చేసుకోను."

దేవరాజయిన ఇంద్రుడి స్వరం గద్గదమైపోయింది. ఆశ్చర్యంతో కన్నులు పెద్దవైనాయి. "నాయనా కర్ణా! ఎంతయినా అభినందించతగ్గవాడవోయీ. నేను మొట్టమొదట వచ్చినపుడు నీ ఎదుటకే రాలేకపోయాను. ఎందుకంటావేమో. నీ ఎదుట నిల్చుని నీ తేజస్సు సహించేంత శక్తి నాలో లేదు."

"ఇప్పుడు మీరు సుఖంగా ప్రయాణం సాగించండి. రథం తయారయింది అన్నాడు వినయంగా కర్ణుడు.

"కర్ణా! నా కాళ్లు బాధపెడుతున్నాయో లేక ద్వారం మూసేసివున్నదో తెలియడంలేదు. కుమారా, నా అంతరాంతరాల్లో వున్న ద్వారమయితే తెరుచుకుంది" అన్నాడు ఇంద్రుడు.

"అయితే తండ్రీ మీకెందుకు వెళ్ళడంలేదు"—కర్ణుడు.

# దాన వీరకర్ణుడు

ఎట్లా వెళ్ళను చెప్పు కుమారా? ఈ కవచ కుండలాలు తీసుకున్న తరువాత నా మీద ఎంత బరువు వుందో నీకు తెలుసా? ఇతరుల సొమ్మంతా అడిగి తీసుకుపోవటం ఎంత కష్టమైన పని? ఈ రోజు నా హృదయం ఎట్లా వుందో నాకు తెలుసు. పైనున్న ఆ పరమాత్మకి తెలుసు. శత్రుసులెందరు ఎదురయినా చంపే దేవతల రాజయిన ఇంద్రుడు ఇంత అశక్తుడెందుకయాడో ఒక్క అడుగు కూడా ముందుకు ఎందుకు వెయ్యలేకపోతున్నాడో అప్పుడు తెలుస్తుంది," అన్నాడు ఇంద్రుడు.

"స్వామీ తమరు తండ్రితో సమానులు, నన్నిల్లా సిగ్గిలచేయటం మీకు తగునా? సిగ్గుపడేట్లు చెయ్యకండి," అన్నాడు తల వంచుకుని కర్ణుడు.

"కర్ణా ఒకమాట అడగాలని వుంది నాకు" అన్నాడు అధికారస్వరంతో ఇంద్రుడు.

"తత్క్షణం అడగండి తండ్రీ" అన్నాడు కర్ణుడు

ఆ స్వరం ఒక స్త్రీ మృదువైన తన చేతి మునిగోళ్ళతో వీణమీటినట్లు వినబడింది ఇంద్రుడికి. "కవచ కుండలాలు తీసి ఇచ్చే సమయంలో నీకు మనస్సులో ఏమీ సంకోచం కలగలా?"

"సంకోచమా? ఎందుకు? సంకోచం మీకు వుండాలికాని నాకుఎందుకు? తండ్రీ, ఇంద్రుడి లాంటివాడు నా యింటికి యాచనకొస్తాడని చెప్పినప్పుడు నా కెందుకింకా. అది నా భాగ్యంకాని? అన్నాడు గభీర స్వభావుడైన కర్ణుడు.

"కర్ణా నీమాటలు వింటూంటే నాశరీరంలోవున్న రక్తమంతా గడ్డకట్టుకు పోతోంది. ఈ కవచ కుండలాలు లేకపోతే అర్జునుడి ముందు ఆగలేవని తెలియదు నీకు? ఈవిచారాన్ని గూడా నువ్వు లెఖ్ఖచెయ్యవా?"

"దేవేంద్రా! నేను ఇవ్వాళ అర్జునుడితో యుద్ధం చేశాననుకోండి రణములో అర్జునునికి అపజయం వచ్చిందనుకుందాం. అరునుడు విజయాన్ని చేపట్టేందుకుగాను దేవతల రాజైన ఇంద్రుడు నావంటివాని దగ్గర కవచ కుండలాలు అనే భిక్ష అడగటానికి వచ్చేరు. ఇది అర్జునుడికి అపజయం కాక మరేమిటి? చెప్పండి. మంచిది, మీరు సుఖంగా విజయం చెయ్యండి. అర్జునుడితో చెప్పండి నీకోసం విజయాన్ని తీసుకొచ్చాను. ఇప్పుడు నువ్వు ఏ బాణం వేసినా కర్ణుడిమీద పనిచేస్తుందని.

"కర్ణా నామాట ఒకటి వింటావా"

"ఆజ్ఞ ఇవ్వండి"

"ఆజ్ఞలేదు గీజ్ఞలేదు. నువ్వు ఏదైనా కోరుకో"

(46- వ పేజీ చూడండి)

# ఆకస్మాత్

ఆ ఆఫీసు పేరేమిటో ఎవరయినా నోరు విప్పి చెబితేనే తప్ప తెలీదు. బోర్డు కూడా ఏమీ కట్టి ఉండదు బయట "నో వేకన్సీ" రేకు తప్ప.

అందులో పనిచేసే జీవాలు పదిన్నర కాకుండానే గృహప్రవేశం చేస్తారు. అయిదుగంటలకల్లా బిల బిల్లాడుతూ బయట పడతారు. పసిబిడ్డకు పాలసీకలు తీసుకెళ్ళాల్సిన వాళ్ళు, కొత్త పెళ్ళాలకు పూలు తీసుకు పోదల్చుకున్నవాళ్ళు, ఇంట్లో నిండుకున్న బియ్యపు డబ్బాను భర్తీ చెయ్యడానికి తాపత్రయపడేవాళ్ళు బజారువేపు నడిచి పోతారు జేబులోని డబ్బులు తడువుకుంటూ.

ఆఫీసు వదలగానే ఎటూ వెళ్ళకుండా సరాసరి యింటికేవచ్చి సినీమాకు తీసుకు వెడతానని ఆ ఉదయం యిల్లాలికి మాట యిచ్చిన జీవుడు మాత్రం–ఆఫీసర్ల చేత తిన్న చివాట్లన్నీ అక్కడే దులిపేసుకుని, యింటి ముఖం పడతాడు.

సోమశేఖరం రెండున్నర సంవత్సరాలు సర్వీసుగల కిందతరగతి గుమాస్తా. గృహస్తై అయిదేళ్ళయినా కాకుండానే ముగురు పిల్లలు 'నాన్నా' అంటూ వచ్చారీ ప్రపంచంలోకి. ఇంట్లో మూడు యింక్రిమెంట్లు వచ్చినా ఉద్యోగంలో మాత్రం ఒకటికూడ రాలేదు. ముక్కుకు సూటిగాపోయే మనిషి గనక ప్రమోషనుగాని, యింక్రిమెంటుగాని వచ్చే ఆశలేమీ లేవు యిప్పట్లో. అయినా చలించడు శేఖరం.

చాల అభిమానంగల మనిషని అతని పోకడలనుబట్టే తెలుస్తుంది. తనమీదకు ఒక్కమాట రానివ్వడు. వచ్చిందా–అన్నవారి ముఖానే సమాధానమిస్తాడు అవతలివాడి అంతస్తుకూడ ఆలోచించకుండా. 'ఈ రోజుల్లో అది లాభం లేదురా ఫ్రెండూ' అని రాజులాంటి మిత్రులెవరయినా అంటే, "వీళ్లు ఏం వాగితే అదల్లా పడాలా మనం! వీళ్ళ యింటిదగ్గర పనిచేసే జవాన్లనుకున్నారా" అనేస్తాడు.

"ఆఫీసర్ల స్వభావాన్నిబట్టి సరిపెట్టుకు పోవాలిరా బ్రదర్" అంటే "ఏం? మనల్ని బట్టి వాళ్ళెందుకు పోకూడదు," అంటాడు పెంకెగా.

"ప్రపంచానికి విరుద్ధంగా...అందరూ ముందుకునడిస్తే నువ్వు వెనక్కునడుస్తానంటే ఎలా ఒప్పుతుందిరా."

"అయితే రావులాగా, కాకాపట్టడం నేర్చుకోమన్నావా" అని హేళనగా నవ్వేస్తాడు.

ఆఫీసులో పనిచేసే అందరిలోకి సోమశేఖరం తలబిరుసువాడని ఎంత కొత్తగా వచ్చిన ఆఫీసరుకయినా మొదటి పరిచయంతోటే తెలిసిపోతుంది. అతనితో మంచిగా ఉండే అధికారి ఒకడూ లేడు. అందుకనే అతనికి రోజూ పదిన్నరనుంచి అయిదు గంటలవరకు 'సిట్,స్టాండ్' వ్యాయామమే.

కాగితంమీద కలంపెట్టగానే "సార్! అయ్యగారు ఏడువందల అరవయి అయిదు ఫైలు తీసుకురమ్మంటున్నారు." అంటూ వస్తాడు సూపరింటెండెంటుగారి జవాను. ఆ ఫైలు వెతికి తీసుకువెళ్ళి అడిగినదానికి

## "మారుతి"

సమాధానం చెప్పివచ్చి కుర్చీలో కూచోగానే "సార్, పర్సనల్ రిజిష్టరు, రన్నింగ్ నోట్ ఫైలు తెమ్మంటున్నారు మేనేజరుగారు" అంటూ పిలుపు. వెళ్ళినప్పుడల్లా పెన్సిలుతో వెయ్యాల్సిన రూళ్లు యింకుతో వేశావనో, అట్ట నలిగిందనో ఏదో వంకపెట్టి "యూస్‌లెస్, స్టుపిడ్" లాంటి ఆశీర్వచనాలు తగుల్తాయి.

"థాంక్‌యూ" అని నిర్లక్ష్యంగా వచ్చేస్తాడు తన సీట్లోకి. కూర్చున్న మరో నిమిషంలో యింకోరి దగ్గరనుంచి పిలుపొస్తుంది. వెళ్ళంగానే ఆశీర్వచనం.

నెలకొక ఛైనాచార్జిమెమో వస్తూంటుంది. వార్నింగులు, సెన్సర్లకు శేఖరంలాంటి వాళ్ళకోసం ప్రత్యేకం ఒక గుమాస్తాను వేశారా ఆఫీసులో.

* * *

ఆవేళ ఆదివారం. మధ్యాహ్నం ఒంటి గంటకు సూపరింటెండెంటు ఆఫీసరుగారింటి ముందు గుమాస్తా రావు నుంచున్నాడు. చేతులో ఫైళ్ళకట్టలో అతివినయంగా గేటు యివతలనుంచే పిల్చాడు 'సార్' అని. వినయం, విధేయత, గౌరవం, ప్రేమ ఉట్టిపడుతున్నాయాపిలుపులో.

అయ్యగారింట్లో పిల్లల గుడ్డలు పిండి బుజానవేసుకుని ఆరవెయ్యటానికి వచ్చిన జవాను రంగడు, 'అయ్యగారు యిప్పుడే పడుంవాల్చారు' అన్నాడు రహస్యంగా, పెద్దగా అంటే ప్రమాదం అన్నట్టు.

"బయట ఎండగా ఉంది. మైలున్నర నడిచివచ్చాను. గేటుతీస్తే ఆ గోడ నీడన కూచుంటా" అని దీనంగా అడిగాడు.

దసరా మామూలు రూపాయి అడగగానే యిచ్చాడు రావు. అది జ్ఞాపకం ఉన్న రంగడు మెల్లిగా గేటుతెరిచి రావును లోపలికి రానిచ్చాడు. రావు మెట్లమీదనే గోడ కానుకుని కూచున్నాడు. రంగడు తన పని మీద వెళ్ళిపోయాడు.

వరండాలో ఒక పేముఉయ్యాల. అందులో ఆఫీసరుగారి మూడేళ్ళ ముద్దుల మనుమరాలు ఊగుతున్నది. అప్పటిదాకా ఊపుతున్న పేరమ్మ లోపలికి పోయింది అమ్మగారు పిలిస్తే. ఉయ్యాల ఆగిపోగానే అమ్మాయి దృష్టి మెట్లమీద కూర్చున్న గుమాస్తామీద పడింది. సన్నగా రాగం మొదలుపెట్టింది. "ఏయ్...ఊపు...ఊపమంటే ఊపవేం" అన్నది రావును చూస్తూ.

రావు కొంచెం తటపటాయించాడు. "ఎవ్రరా బయట...పిల్లదాన్ని ఏడిపిస్తారు... ఊపండి" అని ఆఫీసరుగారు కేకేశారు.

రావు గజంబద్దలాగా నిలబడి కిక్కురుమనకుండా ఉయ్యాలదగ్గర కెళ్ళి ఊపేస్తూ నిలబడ్డాడు. ఇంతలో ఆఫీసరుగారు బయటకు వచ్చారు. రావునుచూసి ఒక మందహాసం చేశారు. దానితో రావు పరవశమయ్యాడు. ఆక్షణంలో అతనికి ఆఫీసరుగార్ని అమాంతం ఉయ్యాల్లో ఎక్కించి ఊపెయ్యాలన్నంత సంతోషంతో ఒళ్ళు మెలికలు తిరిగిపోయింది.

"పనిమీద వచ్చావ్!" అన్నా రాఫీసరు.

"చూడాల్సిన ఫైల్సు అర్జంటు వుంటేను తీసుకువచ్చాను సార్" అన్నాడు రావు కొంచెం తెప్పరిల్లుకుని.

అంతలోకే కోపంవచ్చింది శ్రీ వారికి "దానికో వేళా పాళా లేదూ" అన్నారు, మొగం కందగడ్డలా చేసుకుని.

# ఆధిక్యత

"మీరు... మీరే సార్... నిన్న... రేపు మధ్యాహ్నం తెమ్మన్నారు కంట్రాక్టర్ల ఫైలు, యింక్రిమెంటు ఫైలు, బిల్డింగు ఫైలు...' మోస్టు ఒబీడియంటుగా అన్నాడు రావు.

"ఆల్ రైట్, కమిన్" అని లోపలికివెళ్ళి కుర్చీలో కూర్చున్నా రాఫీసరుగారు. రావు పాడ్ తీసుకెళ్ళి ఆయనముందు పెట్టి చేతులు వెనక్కి పెట్టుకుని నిలబడ్డాడు.

ఆఫీసరు ఒక ఫైలు తెరిచి "వాటీజ్ దిస్" అన్నారు. అంటే 'అది దేనికి సంబంధించిందో సమగ్రంగా చెప్పు' అన్నమాట. చదువుకోడానికి ఓపిక తక్కువ.

"అది యింక్రిమెంటు ఫైలు సార్... సోమశేఖరానిది ఈ నెల పది హేడో తారీఖు ద్యూ సార్".

"వాట్, సోమశేఖరం!...దట్ రోగ్!"

"అవును సార్! అతనే..."

"వాడి యింక్రిమెంటు సంవత్సరం స్టాప్ చేశాం కదూ!"

"సంవత్సరం అయిపోయింది సార్!"

"యింకా అతనిమీద ఛార్జెస్ ఏమీ పెండింగు లేవూ!"

"లేవు సార్!"

"ఎందుకు లేవు..."

ఏం చెప్పాలో తెలీక తికమకపడ్డాడు రావు. ఆఫీసరుగారి బుర్రలో వేరే ఆలోచనలున్నాయి. ఆయనకి సంవత్సరం కిందట సోమశేఖరం తనని ధిక్కరించి మాట్లాడిన సన్నివేశం జ్ఞాపకం వచ్చింది. "అంత తలబిరుసా! అంత నిర్లక్ష్యమా! మేనేజరు హెడ్ గుమాస్తా కూడ అతన్ని గురించి చెడ్డగానే చెబుతారు."

"రావుకుకూడ అవే ఆలోచనలు స్ఫురించినయి.

సోమశేఖరం తనని పదిమందిలోనూ యిన్సల్టు చేశాడొకసారి. ఆఫీసర్లతో పితూరీలు చెబుతావని, యింకా ఏమేమిటో నానామాటలు అన్నాడు. ఆ పరాభవం అతన్ని అప్పటినుండి వేధిస్తూనే ఉంది. కాని సోమశేఖరాన్ని చూస్తేనే భయం తనకి. వాడు తనంటే మరీ ఒంటి కాలిమీద వస్తాడు! గట్టిగా మాటలాడితే తంతాడు కూడాను! రఘూతో పేచీ పెట్టుకుని, వాడేదో అన్నాడని అమాంతం పిట్టగోడ మీదనుంచి ఎత్తి కిందకు వదిలిపెట్టాడు. రఘు వళ్ళు హూనం హూనం అయి చావు తప్పి కన్ను లొట్టపోయి కొంపజేరుకున్నాడు. అలాంటి ప్రమాద మేదయినా తెచ్చిపెడతాడేమోనని తనకు భయం.

ఆఫీసరు ఫైలులో రావు వ్రాసిన నోటంతా సమగ్రంగా చదువుకున్నారు. ఒకక్షణం కనుబొమ్మలు చిట్లించి 'ఈ ఫైలు రేపు ఆఫీసులో పుటప్ చెయి' అని ఆర్డరు వేశారు.

ఏవిధంగా నయినా సోమశేఖరాన్ని కవ్వించి అతని యింక్రిమెంటు ఆపెయ్యడమే ఆయన పరమావధి!

* * *

సోమవారంనాడు ఒంటిగంటయింది. ఆఫీసరుగారు వస్తున్నారనడానికి చిహ్నంగా బంట్రోతువచ్చి గది తలుపులు తెరిచి ఉంచాడు.

ఆ చప్పుడు విని ఎక్కడవా రక్కడ మాట్లాడటం మాని కలానికి పని చెప్పారు పెద్ద సిన్సియర్ గా పనిచేస్తున్నట్టు. మేనేజరు గావుకేకలు మాని తగుస్థాయిలో మందలిస్తున్నాడు తనతో పనిఉండి వెళ్ళిన గుమాస్తాను. ఒకపక్కనుంచి హాల్లో టైపు మిషన్ల మోత హోరెత్తిస్తోంది.

రానేవచ్చా రాఫీసరుగారు. కుర్చీలో సాంతం కూర్చోకుండానే కాలింగ్ బెల్ మోగించాడు. 'అరేయ్! రావును పిలూ...'

జవాను పదివేల మీటర్ల నడక పందెంలో ఆఖరికి నడిచేటంత వేగంతో నడిచి రావుకు ఆ హుకుం అందచేశాడు.

తనని ఎందుకు పిలుస్తున్నారో తెలిసిన రావు యింక్రిమెంటు ఫైలు తీసుకువెళ్ళాడు.

'ఏమిటది' అన్నా రాఫీసరు సహజ సిద్ధమైన కోపంలో 'ఫ...ఫ... ఫైలుసార్... యింక్రిమెంటు...

'ఓహో! అదా...యిలా యివ్వు' అని తీసుకుని ఓపక్కన పెట్టుకుని 'అలా సోమశేఖరాన్ని పిలూ... నువ్వెళ్లు' అని ఏక కాలంలో రెండుఆజ్ఞలిచ్చారు.

రావు నిష్క్రమించగా సోమశేఖరం ప్రవేశించాడు. సైకిల్ కట్టు కట్టిన తెల్లని గ్లాస్కో ధోవతి, బయటకు కనిపించే అండర్ వేర్, కట్ బనీనుమీద వేసుకున్న గ్లాస్కో లాల్చీ అచ్చం పదహారణాల ఆంధ్రుడి కళ ఉట్టిపడుతున్న దతనిలో.

'నీ పర్సనల్ రిజిష్టరు చెకింగుకు పెట్టేదా

యీ కెల్' అది ఆఫీసరుగారి మొదటి ప్రశ్న. సోమశేఖరం వేషధారణ చూడగానే ఆఫీసరుగారికి చీమలు పాకినట్టనిపించింది. బోడితల ఒకసారి నిమురుకున్నారు. అది కోపం రాబోతున్నదని తెలిపే సూచన. శ్లేష్మం అడ్డపడ్డట్టు సకిలిస్తే యుద్ధ ప్రమాదాన్ని తెలిపే సైరన్నమాట!

"ఇవాళ పదిహేనవ తేదీయేగా" అన్నాడు సోమశేఖరం నిర్లక్ష్యంగా.

"నాన్సెన్స్... ప్రతి నెలా ఫిఫ్టీన్త్‌కంతా రిజిస్టర్సు పెట్టమని ఎన్నిసార్లు చెప్పాను, బుద్ధిలేదూ ... స్టుపిడ్ ...' అంటూనే బెల్ నొక్కాడు, జవాను హాజరుగా నిలబడ్డాడు.

"రావును పిలూ"

సెకండు వ్యవధిలో రావు ఊడి పడ్డాడు. చేతులో కాగితం కలంతో. కలం అదివరకే తెరిచి ఉంచుకున్నాడు రెడీగా. "ఫ్రేమ్ ఛార్జెస్ ఆన్ హిమ్..." అని ఆఫీసరుగారంటుండగానే "నేనిక వెళ్లేదా...అర్జంటు కాగితాలున్నాయి రాసుకోవాల్సినవి" అన్నాడు సోమశేఖరం.

ఈ మాటలకు పెట్రోలు పోసినంతగా మండిపోయింది ఆఫీసరుగారి ఒళ్లు. ఆ కోపంలో అతన్ని సస్పెన్షనులో పెట్టొచ్చుగాని దానికి కారణం చాలదు.

సమాధానం కోసం ఎదురుచూడకుండానే వెళ్ళిపోయాడు సోమశేఖరం.

"ఆల్ రైట్" అని ఒకసారి సకిలించి "అతని యింక్రిమెంటు, ప్రొబేషను యింకో సంవత్సరం యెక్స్టెండు చెయ్యి"

"సరేసార్" అని వెళ్ళిపోయాడు రావు.

* * *

"ఎంత అన్యాయంరా" అన్నాడు రాజు.

"ఘోరమైన దురన్యాయంరా" అన్నాడు నటేశం అంతకన్న వేరే పద జాలం దొరక్క.

సోమశేఖరం తాపీగా సిగరెట్ కాలుస్తూ "వీడిచ్చే వెధవ యింక్రిమెంటు డబ్బులు నేను కాల్చే సిగరెట్ల విలువ చెయ్యదు. ఎందుకురా అలా బాధపడతారు". అన్నాడు. అతనికి చీమకుట్టినట్టు కూడ అనిపించలేదు. అందుకు కారణం అతని ఆత్మాభిమానమే. ఎక్కడినుంచో కొండిశీకుల్లా వచ్చిన అధికార్లచేత కూడా మాట పడటమా! అత్త ఒకింటికోడలే అన్న సంగతి మర్చిపోతారు పైఅధికారాలు రాగానే.

"ఆకాశరామన్న ఉత్తరాలు రాస్తేనో" అన్నాడు లింగమూర్తి.

"ఎవరికిరా" సందేహంగా అడిగాడు రాజు

"ఆఫీసరుగారి దివ్యసముఖమునకు"

"పుట్టిన బుద్ధి పుడకలతో పోవాలిగాని యిలాంటివాటివల్ల మారుతుందిట్రా!" అన్నాడు నటేశం.

"మారితే మారకపోయినా తనని గురించి జనం ఎంత శ్రద్ధగా చెప్పుకుంటున్నారో అతన్నా తెలుస్తుందిగా"—అని లింగమూర్తి అభిప్రాయం.

"ఏమని రాద్దామంటావ్?"

"అదంతా నీకెందుకు?...ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ దగ్గర పెట్టుకుని అయిదు అరఠావులకు తక్కువ కాకుండ తయారుచేసే పూచీ నాదీ" అన్నాడు లింగమూర్తి. అతనికికూడా ఆఫీసరంటే కడుపుమంటే. కానీ ఎప్పుడూ బయటపడటానికి సాహసించడు. ఎవరయినా నాలిక బుజాన వేసుకునిపోయి ఆఫీసరు చెవిన వేస్తారేమోనని భయం.

వీళ్ళ తంతుచూస్తుంటే సోమశేఖరానికి నవ్వొచ్చింది. వికవిక నవ్వేశాడు. మంత్రాంగం చేస్తున్న మిత్రబృందమంతా క్వశ్చన్‌మార్కు మొగాలుపెట్టి యిటువైపు తిరిగారు.

"ఎందుకురా నవ్వావు" అన్నాడు నటేశం.

"మిమ్మల్ని చూస్తుంటే నవ్వొస్తున్నదిరా" ఒకరిమొగాలొకరుచూసుకుని ఏమీ తోచక సోమశేఖరం ముఖంలోకి చూచారు.

"ధైర్యం ఉంటే ముఖంమీదే అడగెయ్యాలిగాని ...ఈ పిచ్చికమ్మ ఉత్తరాలెందుకురా" అన్నాడు సోమశేఖరం.

కెవ్వున కేకపెట్టాడు రాజు. ఆఫీసరు పిలుస్తున్నాడంటేనే చలిజ్వరం వస్తుంది రాజుకు.

"పిల్లి మెడలో గంటకట్టే ఎలికవ్రా నాతండ్రీ" అన్నాడు లింగం!

"అందుకనే నోరుమూసుకు కూచోండి. ఇలాంటి అవకతవక పనులు చేస్తే ఏం ఉపయోగం?"

"సరే! నీ మీద యిదికొద్దీ అలాగని అనుకున్నాంగాని లేకపోతే కందకులేని దురద చేమకెందుకూ..." అన్నాడు లింగమూర్తి సత్యభామ పోజులో!

కొన్ని రోజులు గడిచాయి.

ఆనాడు ఆఫీసరుగారు ఉగ్రుడై నరసింహావతారం అప్పుడే ఎత్తినట్టుగా వచ్చారాఫీసుకు.

"ఓరీ హిరణ్యకశిపా" అన్నట్టు సోమశేఖరాన్ని పిలిపించారు. సోమశేఖరం ఠీవిగా నిలబడ్డాడు "ఏమిటన్నట్టు" ఆఫీసరు మొగంలోకి చూస్తూ.

ఆఫీసరుచేతులో టైపుచేయబడిన అయిదు అరఠావుల కాగితాలు కిటికీలోనుంచి వచ్చే గాలికి రెపరెపలాడుతున్నయి.

"ఎన్నిరోజులు పట్టింది యిది రాయటానికి" అని ఇంగ్లీషులో గదమాయించాడు.

"ఏమిటిసార్" అన్నాడు సోమశేఖరం, అంతా అయోమయంగా ఉండి......

"ఈ ఉత్తరం నువ్వేకదూ రాసింది?"

"కాదు" అన్నాడు విషయం కొంచెం అర్థంచేసుకుని.

"వాట్ కాదు! నువు రాసింది చాలక పై అధికార్లకుకూడ కాపీలు పంపించావు కదూ!"

"నాకు తెలీదు. నాకెప్పుడూ అలాంటి ఉత్తరాలు రాసే అలవాటు లేదు."

"అలా రాయటం ఎంత అవమానకరమో తెలుసుకోలేని బ్రూట్!......ఆల్ రైట్ సాయంత్రం ఆఫీసువదలగానే మాయింటివద్ద చూడు నన్ను."

"ఇళ్ళకువచ్చే అలవాటు నాకు లేదు... ఏదయినా అడగాలంటే యిక్కడే అడగండి" అన్నాడు సోమశేఖరం.

"నీ చేతులారా నీ భవిష్యత్తు నాశనం చేసుకుంటున్నావ్. యింత పొగరు పనికిరాదు గవర్నమెంటుసర్వెంటుకి" అన్నారు ఆఫీసరు సోమశేఖరం కళ్ళలోకి నిలన్ చూపులు చూస్తూ.

"అది నాకు తెలుసుసార్."

"అన్నీ తెలిసేనా యిలాంటి తుచ్ఛపు పన్లు చెయ్యడం!"

"నేనేమీ అలాంటివి చెయ్యలేదే!..."

"నేను యిడ్లీలో సాంబారేసుకుంటే నీకెందుకు? గోంగూర పచ్చడేసుకుంటే నీకెందుకు!...అవన్నీ పై అధికార్లకు కూడ తెలియపర్చడానికి బుద్ధి ఉండక్కర్లా!"

"ఆ ఉత్తరం నేను రాయలేదని మొదటే చెప్పాను"

"అయితే ఎవ్రు రాశారంటావ్"

"తెలీదు."

"తెలుసు!...నీకు తెలీకుండా జరగదు!"

"అలాగే అనుకోండి." అని విసురుగా బయటికి వచ్చేశాడు.

సోమశేఖరాన్ని చూసి అప్పుడే ఎదురుగా వస్తున్న లింగమూర్తి పక్కవాకిలిగుండా తప్పుకున్నాడు. లేకపోతే ఆ కోపంలో పిత్త

(56-వ పేజీ చూడండి)

పూర్తి జీవిత పోలసీలు

# నాకు భీమా అవసరం వుందా?

వయస్సు ఎంత తక్కువగా వుంటే అంత ఎక్కువగా జీవిత భీమాను గూర్చి ఆలోచించాలి. దాచిపెట్టడానికి సమయం వుంది. దాచిపెట్టగల్గిన ముసలి తండ్రిని పోగొట్టుకోడం కంటె కూడా వయస్సులో వున్న తండ్రిని పోగొట్టుకోడం ఆర్థికంగా గొప్ప దెబ్బ. (ఓ నిమిషం ఆగి దీన్ని గూర్చి ఆలోచించండి.)

యువకుడై కొద్ది రాబడి గల్గిన వానికి చౌక అయిన జీవిత భీమా ఏదంటె పూర్తి జీవిత పోలసీ. ఈ ప్రణాలిక ప్రకారం 35 సంవత్సరాలవరకు, లేక 80 సంవత్సరాలు వచ్చేవరకు, ఏది ముందయితే అంత వరకు తక్కువ ప్రీమియమ్‌లు చెల్లిస్తారు. భీమా చేయబడిన సొమ్ము, మరణానంతరం, వారిచే నిర్ణయింపబడిన వారికిగాని, ఒప్పగింపబడిన వారికిగాని చెల్లింపబడుతుంది.



ఈ విధానంలో యింకో ప్రణాలిక, లిమిటెడ్ పేమెంట్ (నిర్ణయించ బడిన కనీస కాలం వరకు చెల్లించబడే) పూర్తి జీవిత పోలసీ. భీమా చేయబడిన సొమ్ము మరణానంతరం, ప్రీమియమ్ చెలించ వలసిన సమయం ముందు జరిగినా తర్వాత జరిగినా సరే చెలించబడుతుంది ఇందులో గుర్తుంచుకోవలసిన అంశ మేమిటంటే పోలసీ తీసినప్పుడు ఎంత తక్కువ వయస్సులో వుంటే అంత తక్కువ ప్రీమియమ్‌లు.

పూర్తి జీవిత పోలసీలను గూర్చి యింకా మీ అవసరాలకు అనుగుణ్యంగా వుండే యితర విధాలైన ఉపయోగకర ప్రణాలికలను గూర్చి యీరోజే మీ భీమా ఏజెంటు వద్ద విచారించండి.



## లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

ASP-LIC 18

# చిరునవ్వు

ఆలోచిస్తున్నాడు — గోపాలం, ఏమీ తోచక పడుకున్నాడు. పడుకుంటే నిద్రరాక, ఆలోచిస్తున్నాడు — అసలు కారణం, ఎదుటి పన్ను తీపు పెడుతోంది. డాక్టరు దగ్గర కెడితే, ఊడబీకుతాడేమోనని సందేహించాడు. ఆ అభిమానమేనా మనసులో పెట్టుకోక పన్ను ప్రాణం తీసేస్తోంది. పెదవి మూస్తే నరాలన్నీ లాగేస్తున్నాయి. కళ్లుమాత్రం మూశాడు. నిద్ర రావడం లేదు. మనస్సు పరిగెత్తుతోంది. "ఛీ! చివరికి తన శరీరంకూడా తిరుగుబాటు ప్రారంభించినట్లుందే. అవును మరి, కని పెంచిన వాళ్లే ఉద్యోగం లేకపోవడంతో తన్ని ఖాతరు చేయడం లేదు. తన శరీరానికి తనేం చేయగలిగాడు? ఓ సూటూ, బూటూ?— వాటి సంగతి దేవుడెరుగు, పోనీ సరిగ్గా పోషణేనా చేయగలుగుతున్నాడా? ... మొన్న మటుకు మొన్న అమ్మ, — కన్నతల్లి 'చదువుతున్న చవటకన్న, చేతనైన చాకలి మేలని' పక్కింటి బామ్మగారి మీద కోపాలు వేడి,—వేఁ—డి నిట్టూర్పు విడుస్తోంది. అంటే తనంత బరువైపోయాడన్నమాట! ఇందుకే కాబోలు, 'ధనమూల మిదంజగత్' అన్నారు — తల్లయేది, తండ్రయేది లాభసాటి కాకపోతే చుట్టరికాలు బలాదూర్ ... ఎదుట కిటికీపక్క ఎవరో కదిలినట్లు ముఖం మీద నీడ తెలియజేసింది. కళ్లు తెరవబుద్ధి వేయలేదు, పెదవి మూయ ధైర్యం లేనే లేదుకద!

"ఏమిటో అసలీ ప్రపంచం మీదే అసహ్యం వేస్తోంది. ఎవరినీ కన్నెత్తికూడ బుద్ధికావడం లేదు (దమ్ములేవు). అందరూ తన్ని వాజమ్మకింద జమకట్టే చూపులు చూస్తున్నారు. అబ్బ! కష్టాల్లో ఇంత అంటే మట్టని ప్రపంచం, తన తప్పుల్నీ, లోపాల్నీ ఫేలేత్తి వెక్కిరించే ప్రపంచం,—రేపు తను ఆఫీసరై (ఏ ఆఫీసరో ఇంకా నిర్ణయించుకోలేదు. నిర్ణయించుకోవాలన్నా కూడా కొంచెం కష్టమేగా మరి, చాలా Choice ఉండె.) పదవిలోకి రానీ — 'ఓహో! రారాండి...మా వీధేగదండీ, మావీధి కెప్పుడు వస్తుంటారండీ (నిజానికి పన్ను బాధే గనక లేకపోతే—బోడివీధి, వీళ్ళ దొకటే నేమిటి ఎన్ని వీధులు తిరగడు తను!) అంటూ చేతులు నలుపుకుంటూ తయారయి, చుట్టరికాలు కలిపేస్తారు.

ఈ వేళ పొద్దునంటే పొద్దునే అన్నయ్య శాంతన్నయ్య (ఇంకానయం, సవితి ల్లెక్కటే తక్కువ!) అన్నాడు 'ఇదేం లాభంలేదురా, అబ్బాయి! నీకు. చదువు చెప్పించాను, లోకంలో పడేశాను. నా సంగతి నీకేం తెలియందికాదు-నువ్వా ఎలిమెంటరీ ఎయిడెడ్ స్కూల్ మేనేజర్ని క్షమాపణ వేడుకొని, ఆ ఉద్యోగమే ఖాయం చేసుకో'-తనా చస్తే-చస్తే చేసుకోడు...అబ్బబ్బ, అసలు వాడిమూలాన్నే ఈ పన్ను బాధొచ్చింది-వాడూ, వాడి బుర్రముక్కూ, అరడ్జాల కళ్లజోడూను. వాడి బొంద అది ముక్కుజోడే. ఎందుకంటే కళ్ళ జోడేమో ముక్కు చివరా-జోడులోంచి చూడడు, పైనించిచూస్తాడు. పోనీ, ఏదో ఏడుస్తాడు, నోరైనా మంచిదా అంటే, అదీలేదు. తను ఇంటర్మీడియెట్ అయితే (Part II పోయిందని

## సుందరం

చెప్పలేదు లెండి, అసలు ఉందని వాడికి తెలిసేదుస్తేగా!) ట్రెయినింగు కాలేదంటాడు. ఇచ్చే 45 రూ. లకి, 50 రూ. రసీదు ఇమ్మంటాడు; ఉన్న కర్మచాలక ఉపాకర్మ స్నట్టు నెలనెలా వీడికో 5 రూ. దక్షిణ ఇవ్వాలిట, కన్ఫర్మ్ అయ్యేదాక ఇస్తే చాలుట! (కన్ఫర్మ్ అయితే గవర్నమెంట్, లేకపోతే మున్సిపాల్టివాళ్లో-60 రూ. గ్రాంటు చేస్తుందిగా మరి!) గోపాలానికి కోపం వచ్చిందని ఆశ్చర్యం కూడ వేసింది. ఎందుకంటే తెలియకుండా వచ్చింది. లేకపోతే అసలు వచ్చేదికాదు. అతను కోపంరావడం మరిచి పోయాడు-కాని ఎందుకనో ఇప్పుడు మరిచిపోయిన సంగతి మరిచిపోయాడు. పోయి-'హుఁ' అన్నాడు (సరిగ్గా ఇప్పుడే, తలాడించటంలో తాటాకుల్లో దూర్చి వుంచిన రూళ్ళకఱ్ఱ జారి మూతిమీదపడి ఎదుటిపన్ను ఊడినంత పనైంది) - కోపం తారస్థాయి కెళ్ళింది. 'నువ్వెంత, నీముక్కెంత నా కన్ఫర్మేషన్ సంగతి మాట్లాడుతున్నావు? అనేశాడు. అని బయట కొచ్చేశాడు. కొంత దూరం వెళ్ళాక బడికుర్రాడొకడు పరిగెత్తుకొచ్చి "ఏమండీ మేష్టారండీ, మరండీ, రూళ్ళకర్రమర్చిపోయారండీ!" అన్నాడు. గోపాలం 'హుఁ' అని ముక్కి, చేతులో ఉండిపోయిన రూళ్ళ కర్రిచ్చేశాడు - వెధవది, ఆ పొడుంకాయ గాడికో ఇప్పుడు తుమార్పుణ! మళ్లీముక్కు దామసుకుంటుండగానే తన్నే పలిపింది...ఇంతలో మళ్ళీ కిటికీలోంచి మొహంమీద నీడ కదలాడింది. ఊరికే అటూఇటూ, ఇళ్ళలో, తిరుగుతారెందుకో, ఎవరో పనిలేనివాళ్లు-పనిలేని వాళ్ళంటే, ఉద్యోగం లేనివాళ్లు కాదు; ఉద్యోగం లేదన్నమాటే కాని, బుఱ్ఱకీ, కాళ్లకి, కలానికి, కాగితానికీ నిరుద్యోగి ద్వారా ఉన్నంతపని మరింకవళ్ళకల్గుంటుంది"...

"పనంటే గుర్తొచ్చింది. పక్కవింటి ఎర్రటాయన కేదో పెద్ద పనిలాగుంది, చాలా మంచికారు, దర్జా ఓహో! - తనూ దేవుడు మేలుచేస్తే అటువంటి కారే కొనాలి, అన లాయన్ని తనవిషయం కదిలిస్తేనో-అమ్మచేత వాళ్ళింట్లోవాళ్ళకు చెప్పిస్తేనో. ఇంట్లో వాళ్లంటే గుర్తొచ్చింది-వాళ్ళకో అమ్మాయున్నట్టుంది. ఎర్రగా, లావుగా, పొడూగ్గా బాగుంటుంది. కళ్ళజోడు కూడా ఉన్నట్టుంది - తనకు మాత్రం ఆ అమ్మాయిని చూస్తే ఒళ్లు మంట! తన్ను చూసి అదోలా నవ్వుతుంది. తన కుద్యోగంలేని సంగతి ఆ అమ్మాయికూడ తెలిసిపోలేదుకద! తెలియడాని కేముంది; ఆ అమ్మాయి కారులో తిరుగుతుంటే తన్ని రోడ్డుమీద ఎన్నిసార్లు చూసిందో. తనపని ఎక్కే ఆఫీసు, దిగే ఆఫీసుగా ఉండె—జనాభా లెక్కల సూపర్వైజర్ లాగా (వెధవది, అదొచ్చినా బాగానే ఉండు.)......ఆ ఆది, ఆ అమ్మాయంటే తనకు పడదు, కాని బాగుంటుంది, బాగుంటే బాగుంటుంది, తనేమన్నా పెళ్ళి చేసుకోవాలా-ఉహుఁహు వీల్లేదు-పెళ్లి... ప్రేమలేని పెళ్ళెందుకు? కాని, మరి మళ్ళీ అదేదో కథలో రాశాడే 'ప్రేమిస్తే పెళ్లి చేసుకోటం మంచిదే, అది కోరికల నవ్వ బలాన్ని తెలియజేస్తుంది; పెళ్లిచేసికొని ప్రేమించటం చాలగొప్పది, అది మానవత్వాన్నీ, హృదయ వైశాల్యాన్నీ సూచిస్తుంది' అని. మరి ఈ అమ్మాయివి-పేరేమిటో ఏదో ఒకటి పోనీ, సావిత్రి-సావిత్రినీ పెళ్లి

# చిరునవ్వు

చేసుకున్న తరువాత ప్రేమించకూడదూ!... మళ్ళీ కిటికీనీడ, అంటే కిటికీలోంచి నీడ గోపాలం ముఖం మీద పడింది. కాని గోపాలం ఈ నీడని విసుక్కోలేదు. అతని కప్పుడే కొత్త కునుకుపట్టింది. పెదవిమాత్రం తెరిచే ఉంది.

*　　*　　*

కిటికీ మొదటినీడ, అంటే నీడ లాంటి మనిషి గోపాలం అమ్మ యశోదమ్మగారు. ఇటు కిటికీలోంచి చూసింది. అన లందుకే వచ్చింది. ఆమెలో అంతర్గ్రతంగా ఉన్న మాతృప్రేమ పెలుబికింది "ఏమిటో పిచ్చి నాయన! తిన్నదికూడా వంట బట్టుతున్నట్టు లేదు. ఇంతమంది కిన్ని ఉద్యోగాలొస్తున్నాయి. వాడికదే ధ్యాస- మనస్సులో బాధ. నా దురదృష్టంగాని, వాడి అందానికి లోడు, చిన్నదైనా ఓ ఉద్యోగమంటూ ఉంటే, వేలు గుమ్మరించి పిల్లల్నిస్తామని రారూ!......ఎందుకో సన్నగా నవ్వుతున్నాడు నాయన. కలలో నవ్వు మంచిదంటారు- ఆ ఎలిమెంట్రీస్కూల్లో ఉద్యోగమేమైనా వస్తుందేమో(సదరు చిరునవ్వు గోపాలానికి అతి బాధాకరంగా పరిణమించిన సన్నివేశమని గుర్తించాలి) యశోదమ్మగారు కళ్ళనీళ్లు ఒత్తుకొని వంటింట్లోకి వెళ్ళింది.

*　　*　　*

కిటికీ రెండోనీడ గోపాలం అన్న శేఖరం, అంటే చంద్రశేఖరం బి. ఏ. లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్లో సూపరింటెండెంట్, జీతం 150. అయితే శేఖరానికప్పుడే ముగ్గురు పిల్లలు - ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే, ఆశేఖరం పొద్దున్న గోపాలాన్ని మందలించి ఆఫీసు కెళ్ళాడు. వెళ్ళి ఆఫీసరు చేత చివాట్లు తింటుంటే, మొహం వేలవేసిన తమ్ముడు (వెధవ - అలాగూ, బాగానే ఉంటాడు!) తలపుకొచ్చాడు. వాణ్ణనవసరంగా నొప్పించానే అని బాధపడ్డాడు. శనివారం కనక పెందరాళే ఇంటికొచ్చాడు. వస్తూనే బయటనది కిటికీదగ్గర ఆగాడు. "నిద్రపోతున్నాడు - ఎంత పనిపిల్లాళ్ళా హాయిగా 'చిరునవ్వు'తో పడుకున్నాడో! సరిగ్గా పోషణా అదీ లేక కాని, పిడికెంకా ఎంత బుగ్గలుండేవో, అడవరకు!" అంటూ నిట్టూర్చాడు శేఖరం. మెల్లిగా ఇంట్లో కెళ్ళాడు.

*　　*　　*

మూడోనీడ-ముచ్చటగా మూడన్నట్టు ముఖ్యమైన నీడ. కాఫీపొడిరు తిరిగిన్వడాని కొస్తున్న 'సావిత్రి' (పెళ్ళినాన్నే గోపాలం ఆలోచన్లోని పక్కింటాయన. ఈయన బ్రూక్

బాండ్ టీ ఏజంటు అందుకని కాఫీ, బదులు తీసుకోవచ్చుగా) ఓరగంట చూసింది.

'సావిత్రి'—నిద్రపోతున్నాడు - ఇటు పూర్తిగా తిరిగిచూసింది. "అబ్బ! ఎంతందంగాఉంటాడో రోజూ ఇతన్ని చూసినప్పుడల్లా తన కెందుకో అదోలా ఉంటుంది - పాపం ఎందుకో దిగులుగా ఉన్నట్టుంటాడు. అరె! నవ్వుతున్నాడే-అమ్మో! నన్ను చూసి కాదుగద! ఊహుఁ, కళ్ళుమూసుకుని నిద్ర పోతుంటేను. ఎంత చక్కగా, చల్లగా నవ్వుతున్నాడు. తనెప్పుడు నవ్వినా వేళాకోళంగా నవ్వినట్లే ఉంటుందిట!" అనుకుని ముందుకు కదిలింది 'సావిత్రి'—కదిలి మళ్ళీ ఒకసారి కిటికీలోంచి చూసింది. "అదే చక్కని ముఖం, అదే చక్కని చిరునవ్వు వెన్నెల!" (సదరు వెన్నెల గోపాలాని కప్పుడే మందుతోంది!)

* * *

గోపాలం మంచంమీద బద్ధకంగా కదిలాడు. పన్ను బాధ కొంత సద్దుకుంది. లేచి టైంపీసు వంక చూశాడు. 4-30 అయింది. ఎగిరి కూచున్నాడు "అరె! కలెక్టరాఫీసు హెడ్ గుమాస్తా వెంకటేశ్వర్రావుగారిని కలుసుకోవాలే" అనుకుంటూ, మొహం కడుక్కొని కాఫీ తాగి బయటపడ్డాడు. పక్కింటి ఎజ్జాయన కారులోంచి దిగుతున్నాడు—"క్యాంపు నించి కాబోలు. ఆఁ, అన్నట్టు, ఈయన దగ్గర కూడా ఉద్యోగంకోసం ప్రయత్నిద్దామనుకున్నాడు కదా!—అరె! ఇటుచూశాడు, ఛాన్సు పోగొట్టుకోకూడదు. 'Good evening sir' అన్నాడు. ఆయన చిరునవ్వునవ్వి తలవంచి, కళ్ళతోడు సవరించుకొని ఇంట్లో కెళ్ళాడు......

"ఆఁ అనుకున్నంతా, అయింది. ఒంటి బ్రాహ్మడేదుర్రావటం, పని సానుకూలమవటం కూడానా! ఈ వెంకటేశ్వర్రావుగారిప్పుడే పెలవు పెట్టాలీ," అనుకుంటూ, పెళ్ళాం బిడ్డల్నొక్కసారి చూసుకురావడానికి గుమాస్తాల్నొదిలిపెట్టి, తలుపు లేసుకుంటున్న కలక్టరేట్ నుంచి బయటపడ్డాడు గోపాలం.

* * *

తెల్లవారింది. రోజూ తెల్లవారుతూనే ఉంది. కొత్తల్లో (అంటే నిరుద్యోగి గాడ్యుయేట్ అయిన కొత్తల్లో) 'ఈ రోజు మంచిది కాకూడదా' అనే సన్నని సందేహం, కావాలనే లాంటి వాంఛా' ఉంటుండేవి; ఇప్పుడో, రెండూ లేవు. గోపాలం ఇవతలికొచ్చాడు. శేఖరాని కెవరో ప్యాన్ తెల్లవారకుండానే కాగితమేదో ఇస్తున్నాడు. ముఖం కడుక్కొని లోపలికడుగు పెడుతుండగానే, స్నానం చేసిన వాళ్ళన్నయ్య, ముస్తాబై, పార్వతితో "ప్రక్కనింటాయన కబురు పెట్టారు, ఇప్పుడే వెళ్ళొస్తానంటూ" చెప్పి, బయటికెళ్ళాడు. (దారిలో తంపు దగ్గిర కాళ్ళు కడుక్కున్నట్టున్నాడు, గోపాలం. మరి, ఎంత తమ్ముడైనా బ్రాహ్మడేగా!) గోపాలం కాఫీ తాగలేదు. వాళ్ళింట్లో ప్రొద్దుట కాఫీ మానేసి రెండేళ్ళయింది. ఎలాగూ తొందరగానే భోంచేస్తాముగదా అని వాళ్ళింటో కాఫీలప్రమేయం పెట్టుకోలేదు.

* * *

భోంచేసి ఊరిమీదపడ్డ గోపాలం, ఆఫీసవర్సులో ఆఫీసులకీ, ఇంటర్వల్స్‌లో లైబ్రరీకి తిరిగి సాయంత్ర నాలుగ్గంటలకి కాళ్ళీడ్చుకుంటూ ఇంట్లోకొచ్చాడు. అంత దూరాన్నించే వాళ్ళమ్మ "మా నాయనే! అనుకుంటుండగానే వచ్చాడు. నూరేళ్ళాయుష్షు. లోపలికొచ్చి కాళ్ళు, చేతులు మొహం కడుక్కుని కాఫీతాగి, కొత్త బట్టలు మార్చుకుక్కూర్చో బాబూ!" అన్నది. గోపాలం "ఎండలో తిరగడంచాత కళ్లు బైర్లుకమ్మి ఇంకో ఇంట్లోకొచ్చానా" అనుకున్నాడు. "ఊహుఁ - పక్కింటి కారు కూడా చూశాడుగా తను, రోడ్డుమీద. తనిల్లే - అడుగో అన్నయ్య! మరిమరి, ఏమిటి వీళ్ళిలా మాట్లాడుతున్నారేమిటి. "ఏరా! అలా నిలబడిపోయావేం" అంటూ నవ్వుతూ పిలుస్తున్న శేఖరం పిలుపుతో ఉలిక్కిపడి గోపాలం ఇంట్లోకొచ్చాడు. "అబ్బ! వాణ్ణి, కాస్తకుదటపడనీరా!" అంటున్న తల్లిమాటలు చెవిన పెట్టకుండా శేఖరం కథటూకీగా చెప్పాడు. పక్కింటాయనపిలిచి పిల్లనిస్తానన్నాట్ట గోపాలానికి. గోపాలానికి మూర్ఛపోవట మెలాగో తెలియదు; పోనీ నటించడానికి ఎప్పుడూ చూణ్ణైనా లేదు.

కాని ఒకటిమాత్రం నిజం, తెలిస్తే బాగుణ్ణని బా - ఘా మనస్ఫూర్తిగా అనుకున్న పన్ని వేశాల్లో ఇది మొదటిది. అతనికి బాగున్న వేవీ లభ్యం కాకపోడం కొత్తకాదు కాబట్టి ఎలాగో కాళ్లు నిలవదొక్కుకొని సంగతులు విన్నాడు. హాయిగా స్నానం చేశాడు. చేస్తూ "హాయిగా, మనకింకా స్వేచ్ఛగాఁ అఆ"... గుర్తున్నంతవరకు పాడుకున్నాడు (పాతాళభైరవి తరవాత గోపాలం సినిమా చూళ్లేదు. అదీ ఇంటర్మీడియెట్ పరీక్షల ముందు అర్ధరాత్రిచదువుకని ఫస్టుషోకెళ్లాడు!) గోపాలం కాఫీ తాగుతుంటే వాళ్ళమ్మ పార్వతితో చెప్తుంటే విన్నాడు. "పిచ్చిబాబుకి దిష్టిగానితగిలిందేమో. పడుకున్నప్పుడు చూశాను. నమ్మ నమ్మకపోగాని అప్పుడే అనుకున్నాను. కలలో నవ్వుతున్నాడు, కలిమి కలిసొస్తుందని" ఇంతలో మెల్లిగా అన్నయ్య అందుకున్నాడు. "అరె! నేను కూడ వాడందంచూసి మురిసిపోయావనుకో, నాకు తెలుసే వీడెప్పుడో పెద్దవాడైపోతా (మరి, ఏళ్ళొస్తే!) అనలా నవ్వులోనే ఉంది వాడి Magnetic Personality అంతా" గోపాలానికి కాఫీ సయించలేదు.

* * *

తరవాత సావకాశంగా వివరాలన్నీ తెలిశాయి గోపాలానికి. రుక్మిణి తన కోరికను మొన్నీమధ్యనే వాళ్ళమ్మకు చెప్పిందిట. వాళ్లకు ఒక్కత్తే కూతురు కావడంవల్ల ఆ అమ్మాయి అన్ని కోరికల్లాగే, 'అలాగే, చూదాం' అనేసిందావిడ. (ఎందుకంటే ఆ అమ్మాయి డిక్షనరీలో 'కాదు,' 'లేదు' అనే మాటల్లేవు), కాని నిన్న సాయంత్రం వాళ్ల నాన్నగార్నే అడిగేసిందిట! వాళ్ళ నాన్నగారు, "ఓ, అలాగేనమ్మా" అనేసి, మర్నాడుదయమే కబురు పెట్టారట శేఖరానికి. గోపాలం తనకేమన్నా పైత్యం ప్రకోపించిందేమో ననుకున్నాడు. ఊఁ కొట్టకపోయేసరికి వాళ్లన్నయ్య "ఏమిట్రా నీఅలోచన, చెప్పేది వినకుండా" అనటంతో తను మామూలుగానే ఉన్నట్టు తెలిసింది గోపాలానికి. శేఖరం చెప్పాడు. "కుఱ్ఱవాడు బుద్ధిమంతుడు, రూపసీ కావడమే కావలిసింది, డబ్బుదేముందండీ మాకున్నది చాలకనా' అన్నార్రా రామేశంగారు." ("బుద్ధిమంతనం నిర్వచనమే గనక ముందు తెలిస్తే ఎంతమంది లెక్చరర్లను Good morning, Good evening లతో ఉబ్బేశేవాడినో కదా, అనుకున్నాడు గోపాలం.)

* * *

మామూలుగానే పెద్దలు సుముహూర్తం నిశ్చయించారు. రుక్మిణీ స్వయంవరం యథావిధిగా జరిగిపోయింది. రామేశంగారు ఒక్కగానొక్క కూతురైనందుకు ఘనంగా చేశాడు పెళ్ళనుకున్నారు విచ్చేసిన బంధుమిత్రులు. మనం ఊహించగలిగినట్లే, నెలైనా తిరక్కముందే గోపాలానికి పక్కఊళ్లో బ్రూక్ బాండ్ రెప్రెసెంటేటివ్ ఉద్యోగం వచ్చేసింది. (ఏ మాట కామాటే చెప్పుకోవాలి. రామేశంగారల్లుడు కాబట్టం మినహాయించి, గోపాలానికి, ఈ ఉద్యోగానికి కావలిసిన, అంటే అడ్వర్టయిజ్ చేసిన Qualifications ఏవీ లేవు—అయినా, అవి పైవాళ్ళకి) త్వరలోనే కాపురానికూడా వచ్చేసింది. వచ్చిన రోజునో మర్నాడో ఓ రహస్యం చెప్పింది. తను 'ఆరోజున' కాఫీ పొడరివ్వడానికని వచ్చి, తన 'చిరునవ్వు' చూసి సమ్మోహితురాలయి పోయిందనీ, అందుకనే, నాన్నగారిని అడగాలని గట్టిగా నిశ్చయించుకున్నదిట. గోపాలం నవ్వాడు. అతని నవ్వు బంగారుకొంతు తీసింది. సావిత్రి "అదేమిటీ!" అన్నది. "ఆఁ, ఏదో నొప్పిగా ఉంటే డాక్టరు, తీసేసి బంగారప్పను వేశాడులే, కొమ్ముదిపోయినా బంగారపు దొచ్చిందిగా" అన్నాడు. 

# అసంప్రేక్ష్యకారిత్వము... పంచతంత్రము

...అయిదవ భాగము










నోరూరిన దనుజాంగన మనుజా
హారము కోసము హారము నిచ్చెను







'నాతో వచ్చిన చూపెద' ననగా
కోతి మాటతో నిజమని నమ్మిన
ఆ నరపతి పరివారము తోడుగ
వానరపతి తో వనమున కరిగెను



... గేయరచన ...
నండూరి. రామమోహనరావు — బొమ్మలు.. బాపు















కుని” అన్నాడు రాజు పుంజుకుని.

బైరాగికి హఠాత్తుగా ఉత్సాహం ఉప్పొంగింది.

“భేష్. సరేగాని మరి వాళ్లు దండలు తేకపోతే?”

“తెస్తారు”

“అక్కడే పొరపాటుపడ్డావు. వాళ్ళు ప్లాట్‌ఫారంనించి హడావుడిగా వచ్చేస్తున్నప్పుడు దండలు దొరక్కపోతే? మనం సప్లయి చెయ్యాలి. ఇంకోటి నాయనా: వాళ్ళందరూ సినిమావాళ్లుగదా? వాళ్ళు చూస్తూ ఉండగా నాన్ సినిమావాళ్ళు నాలుగైదో రెండు మూడో దండలు వేస్తే గొప్పగా ఉంటుంది. వీడెవడో చాలా గొప్పవాడురోయ్ అనుకుంటారు. లేపోతే లోకువకట్టేస్తారు.” అన్నాడు.

రాజాకి ఈ ఊహ నచ్చలేదు. “మీరు దండవేశారనుకోండి. మీగడ్డంగట్రా చూసి, నన్ను స్వామి వివేకానందస్వామి అనుకున్నారంటే ఏం జరుగదా......బుక్ చెయ్యరు. నిజంగా గొప్ప వాణ్ణనుకుని” అన్నాడు రాజా.

“నాయనా తిరిగి పొరబడుతున్నావు సుమా.”

“ఇగో! రైల్వే బైరాగిగారూ. మీరలా సినిమా డైలాగులా మాట్లాడకండి. నాకు భయం వేస్తుంది. ఇందాక టోకరాఇచ్చిన వాడూ ఇలాగే మాట్లాడాడు.”

“దానికేం గురూ.”

“గురూ అనకండి బాగులేదు.”

“పోనీ తమ్ముడూ నే చెప్పేదేమిటంటే, ఈ లోకంలో డబ్బు చాలా ముఖ్యం. అన్నిటికన్నా సొంతడబ్బు బెష్టు. అది లేపోతే నెత్తిన కానీపెట్టి వేలంవేస్తే దమ్మిడీ పాడేవడూను ......సినిమాలాంటి చోట మరీ అవసరం, “సొంతడబ్బు ఎంత ముఖ్యం, అదే తెచ్చును ఎంతో సౌఖ్యం” అన్నాడు.”

“ఎవడు?”

“గుర్తులేదు. భవుశా నేనే అనిఉంటాను. ఏం? వేయేలగాని. నిన్ను చూస్తే నాకు ఎందుకో దయకలిగింది. నేను హృషీకేశం పోతున్నాను ఎలాగాను. పోతూ పోతూ నీకు కాస్త హెల్ప్ చేద్దామని...ఒక్క కథ చెబుతా విను...” అన్నాడు బైరాగి.

రైలు గూడూరులో ఆగింది. “మొహం కడుక్కు రెండు మాత్రవేసుకుని కాస్త కషాయం సేవించివద్దాంపద. ఆనక స్థిమితంగా చెబుతాను మంచి కథ.” అన్నాడు బైరాగి.

గూడూరు రైల్వే హోటేలు మాత్ర ఆయన సయించలేదు. ఎలాగో అవి తినేసి, కాస్త ఉప్మాకూడా పుచ్చుకుని, కషాయం, ఉరఫ్ కాఫీ తాగి, బీడీల కట్ట కొనిపించుకుని వచ్చికూర్చున్నాడు.

“చెప్పండి గురూ” అన్నాడు రాజా, ఉత్సాహంగా.

గురువు, కథచెప్పాడు బీడీ ముట్టించి.

## సొంతడబ్బు మాహాత్మ్యము

ఇది నాసొంతంకాదు. ఎవరో ఎవరికో చెప్పగా ఎక్కడో ఎప్పుడో విన్న బాపతు.

ఒక చలనచిత్రనటపితామహుడిని, మరొక కాబోయేనటుడు పలకరించి, సమస్కరించి, “స్వామీ శక్తిఉన్నా చెల్లని వారూ, లేకపోయినా చెల్లదలచుకున్నవారూ ఫెళ్ళుమంటూ వెలగాలంటే, ఏంచెయ్యాలి స్వామీ”అని పృచ్ఛచేశాడు.

వత్సా వినుమని ఒకకథచెప్పాడావృద్ధుడు. ఈ ప్రపంచంలో డబ్బుఅనేది చాలగొప్పది. విజయసాధనకు ఉత్తమపరికరం. ‘డబ్బు’ మూడువిధములు. సొంతడబ్బు, పరడబ్బు, పరస్పరడబ్బు.

వీటిలో సొంతడబ్బు కొంతమందికే చెలుతుంది. రెండోది మనకిపనికిరాదు. మూడోది బెష్టు.

దానివల్ల ఏకోదమ్మున ఇద్దరేసి వృద్ధిలోకి వస్తారు. కొండొకచో ఒకడు ముందర పైకెక్కి పోయి, అక్కడనించి రెండో వాణ్ణి జుట్టుకు పైకిలాగేస్తాడు. (కొండొకచో నెత్తిన కాలేసి తొక్కేస్తాడనుకో) ఫలానా ఆయనకి దారుణమయిన తెలివితేటలున్నాయి అని ఒకడు మొదలెడితే, ఆ ఫలానావాడు ‘అడుగో ఆ ఒకడు లేదూ,...వాడు అలా ఉన్నాడుగాని నివురుగప్పిన నిప్పు, మసిపూసిన మాణిక్యం’అని ప్రచారంచేస్తాడు. అదీవిర్వాటు.

పోతే రెండోమార్గం ఉందేం, పరడబ్బు. అదిఒకవిధంగా సొంతడబ్బుకి రూపాంతరం. పరడబ్బు అంటే, ఇంకోడు గొప్పవాడూ అని మనం పల్లికున ఒప్పుకోవడమే అన్న అర్థం సరేసరిఅనుకో. అలా కాక మనం ఘనులమంటూ ‘ప్రతీఇంకోడ్నూ’కో డైవయ్యడం అనికూడా ఒకఅర్థంవస్తుందిగా. రామచామి అనే మూజిక్ డైరక్టరు, ఈ రెండోఅర్థం ప్రకారం, చూస్తువుండగా కళ్ళ ఎదుట, పట్టపగలు గొప్పవాడై ఊరుకున్నాడు.

పాపం అతడుముందర, నీలాగే వేషం వేద్దామని వచ్చాడు. అదికుదరక, డైరక్షన్ చేస్తానన్నాడు. పోనీ ఫోటోగ్రఫీఅన్నాడు. ఆఖరికి కథలూ, డైలాగులూ రాయాలనిసిద్ధపడ్డాడు. నటనలోను, రాయడంలోను అతనికి కాస్తో కూస్తో ప్రవేశం వుంది. కొంత అనుభవం వుంది. అయినా అతన్ని గురించి డబ్బు వాయించి ఓహో అనేవాడు లేక, అర్ధణాకి చెల్లలేదు అతని శక్తి.

ఒకొక్క శాఖలో ఛాన్సుకోసం వందేసి మందిని అడిగి లేదనిపించుకోవడంతో, ఒకొక్క శాఖకే ఉద్వాసన చెబుతూ వచ్చాడు. చివరికి, సంగీతదర్శకత్వం ఒకటే మిగిలింది. అందులోకూడా లాకేత్వం ఎదురైతే అతనిగతి ఏమయేటట్టూ?

“ప్లేబాక్ పాటలు పాడతానని ప్రయత్నించవోయ్” అన్నాడు అతనిమిత్రుడు.

మనకి పాటలు రావుగదయ్యా అన్నాడు రామచామి.

చిక్కా. అయితే మ్యూజిక్ డైరక్షను కోసం ట్రయిచెయ్యి. అది సులభం కూడా. కిటుకులు నాలుగూ చటుక్కున తెలుసుకు అవీఇవీ కాపీకొట్టి కాలక్షేపం చెయ్యొచ్చు. కాస్త పేరొచ్చి గొప్పవాడి వయేసరికి, సంగీతం కూడా వచ్చినట్టు వచ్చేస్తుంది. అని సలహాచెప్పాడు ఆ స్నేహితుడు.

అడిగి లేదనిపించుకుంటే, ఆ దెబ్బతో

# విక్రమార్కుడి మార్కు సింహాసనం

అతనికథ ఆఖరైపోతుంది. అందుకని చాలా జాగ్రత్తగా ఆలోచించాడు.

అప్పటికి అతనికి ఎకరం బాతిక సెంట్లు భూమివుంది.

ఆ పైపాతిక సెంట్లూ తెగనమ్మి, ఒకళిద్దరు ఐతగాళ్లతో కలిసి చిన్న ఫిలిం కంపెనీ లేపాడు. పావలా అర్ధణా పెట్టుబడితో పది లక్షలఆర్భాటం చేసేసరికి, 'వీడిదగ్గర చచ్చు సంభావన పాతిక వేలుఉంటుందితే', అనుకుని పదివేలున్న ఒక పెద్దమనిషి అందులో చేరాడు.

సరే రామచామి మ్యూజిక్ డైరెక్టరు; ఆ పెద్దమనిషి ఫిలిం డైరెక్టరూను. మిగతాకంపెనీలకి ఈ రామచామి సంగతి తెలిసింది.

ఓహో కాబోలనుకున్నారు.

అక్కడినుంచి రామచామి తనప్లాను ఆచరణలో పెట్టేశాడు.

రామచామిది భారీవిగ్రహం. తెలుగు సినిమా అంత—ఆ మాటకొస్తే దాదాపు అరవ సినిమా డైలాగంత పొడుగ్గా ఉంటేవాడు. కాగా సగటు భారతీయ హీరోయిన్ అంత లావుగా ఉండేవాడు.

చక్కగా పొద్దుటే స్నానంచేసి, విభూది పెండికట్లు దిద్ది, అర్ధరూపాయంత కుంకుం బొట్టు పెట్టి, గజంబద్ద మింగేసినట్లు నిటారుగా నిలబడేవాడు.

ఏం? ఇలా తెల్లారే సరికల్లా ముస్తాబై, కంపెనీ వాసులో కూర్చునేవాడు. అతని శిష్యబృందం పదిహేనుమంది.

వాళ్ళంతా చూడటానికి శిష్యుల్లా ఉన్నా నిజానికి గురువులన్నమాట. రామచామికి ఒకడు వణకడం నేర్పాడు. ఆ వణకడాన్ని సంగీతపు గమకంగా మార్చడం నేర్పాడు మరొకడు. రాగాల పేర్లన్నీ రాసిచ్చి బట్టీ వేయించాడు మరొకడు. వాయిద్యాల పేర్లూ, వాటి తప్పొప్పులు గుర్తులూ తెలియ చెప్పాడు మరొకడు. హిందీ, అమెరికన్, లాటిన్ అమెరికన్ రికార్డులను తర్జుమా చేయడంలో సూక్ష్మ బలువులు బోధించాడు మరొకడు. (ప్రొడ్యూసరు డైరెక్టరు అవాల్సినవాడు).

ఇలా వర్తక రహస్యాలు బాగా నేర్చుకొని, ఆనక సంగీతంకూడా నేర్చుకుని నిజంగానే కొంత సాధించాడు రామచామి.

"జి. ఎన్. బి., ఎమ్మెస్ పాసయాక, పాటలకెవ్వ పైబడి పనికి రాడనిపించుకున్నాక సరిగమలు మొదలెట్టాడు. తెలుసా!"—

మొదలగు పెద్దల కథలను పారాయణం చేసేవాడు, నిరాశ చుట్టుముట్టినపుడు.

ఇదంతా ఇలావుండగా మరోపక్క అసలు ప్లాను అమలు జరిగేది. చక్కపొద్దున్నే ముస్తాబై శిష్యబృందాన్ని వెంటేసుకుని నాలుగైదు కంపెనీలకెళ్ళే వాడు కుశలం అడిగే నెపంతో.

అరవై డబ్భైఅడుగుల పొడుగనిపించే ఈ ఆసామి, అతని వెనక పదిహేను గురుశిష్యులూ బిలబిలాడుతూ వచ్చేస్తే, ఎవరు మటుకు మర్యాద చేయరు?

"వణక్కం సార్ వాంగో" అనేవారు.

"బణకం బళకం" అనేవాడు రామచామి తాంబూలపు నోటితో ముద్దగా ముద్దుగా.

అంటూనే 'తరన్నరన్నా' అని ఆలపించి చుట్టూ చూసేవాడు. తక్షణం శిష్యులు పదిహేనుగురూ "ఓహో! సెబ్బాస్! సెమ్మంగుడి దా నె! వెహు ప్రమాదమాకిది" (ప్రమాదమా ఇరికిదిఅని తాత్పర్యం) అంటూ హాహాకారాలు చేసేవారు.

అవి పూర్తికాకుండానే రామచామి మళ్లీ "దారలారలాల లారలాలలా" అని స్పానిష్ ట్యూను ముక్కవిసిరేవాడు. మళ్ళీ సముద్రపుహోరులాగా ఒకకెరటంవిరిగిన చప్పుడు పూర్తికాకుండానే మరోదాని హోరు మొదలయేది. ఆ దెబ్బకి ఇతర కంపెనీల విర్తా తల చెవులు 'హోరెత్తిపోయి, మనసులు దారుణంగా ఉప్పొంగిపోయి, మాకంటే మాకని బుక్ చేసుకున్నారు.

ఆర్నెల్లు గిర్రున తిరిగేసరికి రామచామి పెద్దసైజు మ్యూజిక్ డైరెక్టరయిపోయాడు.

ఆ సరికి, అతను చాలాకష్టపడి సాధన చేసి నిజంగానే సంగీతం నేర్చుకున్నాడు కూడా.

అయితేనేం. తీరా చూస్తే అది పనికి రాలేదు. అందరు ప్రొడ్యూసర్లూ హిందీవీ, చేతనైతే విదేశీవాళ్ళ ట్యూన్లూ ముక్కకి ముక్కదింపాలనే వాళ్ళే. అది వేరే సంగతి అనుకో.

రామచామి, కొన్నాళ్ళు అలా ఉన్నాక చిరాకేసి, అప్పటికి సంపాదించిన పలుకుబడితో, తనకు ఇష్టమైన నటనాశాఖలో ప్రవేశించి మళ్ళీ పైకొచ్చాడు.

పోతే, తనుగొప్పవాడవడానికి కావలసినంత డబ్బా వాయించి సాయంచేసిన శిష్య పరమాణువులకి ఛాన్సులిప్పించి వాళ్ళకి దారి చూపాడు. నమ్మి చెడిన వాడు లేరు అన్నారు పెనకటికి.

అదీ కథ. అని కథ ముగించాడు ఆ అనుభవజ్ఞుడు" అని కథ ముగించాడు రైల్వే బైరాగి

* * *

"బాబూ నీకు ఇంతటి ధైర్యం తెగింపు ఉన్నాయా?.విద్య నేర్చుకోకుండా, అందులో ప్రవీణుడనని డబాయించి డబ్బా వాయించి నెగ్గుకొచ్చే పట్టుదలా తెగింపూ ఉన్నాయా?" అన్నాడు.

అడ్డంగా తలతాటించాడు రాజా.

"అయితే లాభంలేదు" అన్నాడు బైరాగి. రాజా దిగులుపడిపోయాడు.

"అయినా భయపడకు. నేను చెప్పేట్టు చేస్తే వృద్ధి కొచ్చేస్తావు. నా చేతిలో ఐదు రూపాయలియ్యి. బేసిన్ బ్రిడ్జిస్టేషనులో రైలాగ్గానే స్టేషన్ వెనక ఒక ఇంటికెళ్ళి ఓ పూలదండకొని తెస్తాను. లేపోతే పూలే నా కొంటాను. రైల్లో దండ కడదాం. సెంట్రలు రాగానే అది వేసుకుదిగు. నీకు స్వాగతం ఇచ్చే సినిమా వాళ్ళు, 'ఫలానా వాడివి నువ్వే' అని గ్రహించడానికి కూడా గుర్తు ఉండాలి కదా. అదే ఈదండ అన్నమాట. తే డబ్బు" అంటూ బైరాగి అతన్ని లేవదీశాడు.

బేసిన్ బ్రిడ్జి స్టేషనులో బైరాగి రైలు దిగాడుగాని, ఎందుచేతనో మళ్ళీ ఎక్కలేదు.

అందుకని వరహాలరాజా బిక్కమొహం వేసుకుని ఒక్కడే మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషన్లో రెండో నెంబరు ప్లాటుఫారంమీద కుడికాలు మోపాడు దేముడిని తలచుకుని.

చుట్టూ పరకాయించిచూశాడు తనకోసం ఎవరన్నా ఎదురొచ్చారేమోనని.

పది నిమిషాల తర్వాత అతనికి బుర్ర పని చేసింది. తనకి సినిమావాళ్ళు స్వాగతం ఇవ్వబోతున్నారని తను ఉత్తినే బైరాగికి అబద్ధం చెప్పాడన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. మర్చిపోయి, అది నిజమే అనుకున్నందుకు, అనుకుని నిరుత్సాహపడ్డందుకూ, నవ్వుకుని, ధైర్యం తెచ్చుకుని, నరసన్న తనకు వదిలిపెట్టిన పెట్టెని (చిత్తుకాగితాలు సహా) చేతబట్టి, ముందరకు అడుగుపెట్టాడు వరహాలరాజా.

(పైవారం దండయాత్ర)



# కాళీహైమవతీ..శివాత్రినయనీ..

ఘనుడా భూసుర డేగెనో
నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో..."

* * *

"చాల్లే, నా ప్రాణానికి ఈ భాగవతం వచ్చిపడింది. ఇంకా తెల్లారిందో లేదో, అప్పుడే ఆరంభించావూ! నీకూ, మా నాన్నకీ సరిపోయిందే మాతల్లీ! తల్లిని గదా, కన్నదాన్ని కదా నా మాటంటే అంత లక్ష్యం లేకుండాపోయిందేమే? ఎందుకొచ్చిన చదువూ? మళ్ళీచూస్తే పన్నెండేళ్లు ముడికింద కొచ్చాయి. ఏవన్నా అంటే ముక్కూ, మొహం ఏకంచేసుకోవడం మాత్రం తెలుసు. ఎన్ని చదివితే మాత్రం ఏమిటే .. తల్లిచెప్పినమాట విననప్పుడు...భారతాలూ, భాగవతాలూ చదివితే వస్తుందా పరమార్థం? వద్దు మొర్రో అంటూంటే విన్నారా ఆయనమాత్రం? ఎందుకిప్పుడీ భాగవతం అన్నాను. బెల్లం కొట్టిన రాయిలా ఊరుకుంటారంతే! నా నోరు నొప్పెట్టేదాకా నేనరవటం తప్ప ఒక్కటేనా నేను చెప్పినట్టు చేసిన పాపాన పోయారా? పదిహేనేళ్ళయి కాపరానికొచ్చాను...అప్పట్నుంచీ చూస్తున్నానుగా ఆయనతంతూ. రాత్రి తెల్లవార్లూ దోమలతో నిద్రలేక చచ్చానుగదా, కాస్తంత పెందరాళే లేచి, నీళ్ళపొయ్యిలో నిప్పు తగలేసి ఓ డేగిసాడు నీళ్లుపడేస్తే ఈపాటికవి కాగవూ? ఆ చేత్తోటే కుంపటంటించి, గిన్నెలో నీళ్ళెట్టి డికాక్షను దింపేసే, లేవగానే పాలు వెచ్చబెట్టుకుని ఇంతకాఫీ గొంతుకలో పోసుకునేదాన్ని కాదూ?

ఎవర్ని ఉద్ధరించడానికో తెల్లవారుఝామునే లేచి దేవుడిమందిరం ముందు కూర్చోవటం? సుందరకాండ పారాయణం చేస్తే, పెళ్ళాన్ని సుఖపెట్టినట్టవుతుంది గామోసు!

ఇంకా మీ నాన్న దేవతార్చన పూర్తి కాలేదేమిటే. ఆయనే అనుకుంటే ఆయనకంటే త్రెవై పోతున్నావు నువ్వు. లోపల చదువుకుని ఏడవటం యెందుకూ? పైకే అఘోరిస్తే నేనూ వింటానుగా. నా చెవు లేంపాపం చేసుకున్నాయే నా తల్లీ!

అదిగో గంట తీస్తున్నట్టున్నారు...నివేదనకి కాస్త పటికబెల్లం ముక్క అక్కడ పడేసిరా. ఇంట్లో దేవుడికి రోజూ నివేదన కావాలి కాబోలు! మొన్న ఏకాదశినాడు గోపాలస్వామిగుళ్ళోకి వెడదామని సాయంత్రం వచ్చేటప్పుడు కొబ్బరికాయ తెమ్మంటే, ఊరు గొడ్డోయిందన్నారు. గుళ్ళోదేవుడికి కొబ్బరికాయ దొరకదు కానీ, ఇంట్లో విగ్రహానికి పటికబెల్లం పంపులకొద్దీ దొరుకుతుంది.

ఆ పూజయితే, కాస్తంత కుంపటంటించండి ఇలావచ్చి.

ఏమిటోనమ్మా వొళ్ళంతా పచ్చిపుండులాఉంది. ఒక్కరాత్రి నిద్రలేకపోతే, ముప్పై లంఖణాలు చేసినంత నీరసం

## ఉషశ్రీ పురాణపండ

వస్తోంది. ఈ వేసంకాలం ఎలా నడుస్తుందో కానీ మా అమ్మా, పగలూ రాత్రీ ఒక్కలాగే వేసేస్తోంది, చెప్పినమాట వినిపించుకోని మొగుడిలా.

అబ్బబ్బ! కిరసనాయిలు సీసాఅంతా అయిపోయిందా, లేదా? ఒక్కపూట కుంపటంటించడానికి శేరు నూనె కావాలి! ఇలా అయితే, సంసారం సాగినట్టే! అందుకే ఏపనీ ఆయనకు చెప్పను. మొన్నటికి మొన్న సంతకెళ్ళి అందరూ మూడణాలు చేసితెస్తే, ఈ మహానుభావుడు పావలా అర్ధణా చేసి తెచ్చారు! అక్కడికీ పవిత్రరుగూ, పదలం పుచ్చాను! నేను లేకపోతే తెలిసేది, అయ్యగారికీ అమ్మాయికీనీ.

వారంరోజుల్నుంచిపోరుతున్నాను. పిల్లకీ ఈడొస్తోంది, రెండంటే రెండు పైట కండువాలు తెమ్మని. అలాగే అని వెళ్ళి ఇచ్చిన పదిపెట్టి భాగవతం పట్టుకొచ్చి దాని మొహానపడేశారు! ఆడపిల్లలికి చదువెందుకో? మా అమ్మ చదువుకుందా, అమ్మమ్మ చదువుకుందా? నేనేం చదువుకుని యేడిశానని!

అయితేనేం, రమ్మను! ఈ చదువులు వెలిగించినవాళ్ళని...వందలకి వందలు పోసి యమ్మేలూ, బియ్యేలూ చదువుకున్న పిల్ల ఒక్కత్తైనా నాతో వాదించగలదేమో! మండోదరి రావణాసురుడి పెళ్లామో, వాలి కూతురో ఒక్కత్తికీ తెలీదు! వారంరోజులు పురాణానికెడితే తెలుస్తుంది వీళ్ళచదువు. గణపతి నవరాత్రుల్లో హరికథలు వింటే వచ్చే చదువు, నా అగేసి యేళ్ళు చదువుతారు మళ్ళీనూ.

ఏమేవ్, నీకింకా రుక్మిణీ కళ్యాణం అవలేదా యేమిటి? కుంపటిమీద పాలు పొంగుతున్నట్టున్నాయి.

ఆయన నూతిదగ్గరకు వెళ్ళినట్టున్నారు. కాస్తంత కిందకి దింపి, కలిపి నాగొంతుకలో పొయ్యి. అప్పుడే ఏడున్నరయిందటే!

మూడు నెల్లనుంచి పోరుతున్నాను. పిల్ల ముచ్చట పడుతోంది ఒక్క రేడియో కొనమని. ఎందుకూ? నా మాటంటే లక్ష్యం ఉంటేగా?

సరిగ్గా నాలుగెకరాలన్నా పొలం లేదు. అరవై రూపాయల ముష్టిజీతం...అయితే నేం సుబ్బమ్మగారి మొగుడు మూడు వందలు పెట్టి కొన్నాడు!

వాళ్ళు రేడియో తిప్పినప్పుడల్లా, నా చెవుల్లో సీసం కరిగించి పోసుకోవాలనిపిస్తుంది. అక్కడికీ ఈ యేడాది నా వంటిమీద కమా చేయించుకోనే లేదు.

అప్పుడే పొయ్యిలో నిప్పురాజేస్తున్నా వేమిటే? ఈవేళ ఆదివారమే కదూ? కాస్త ఆలస్యంగా అయినా చేసుకోవచ్చు వంట.

ఏమిటో మరీ నీరసంగా ఉంది. ఆ కవల గోడగూట్లో డబ్బాలో గోధుమనూక ఉన్నట్టుంది. కాస్తంత కరివేపాకూ, అల్లం వేసి కలియబెట్టండి. నువ్వెందుకే కదులావూ? అత్తారింటికెళ్ళాక ఎలాగూ చాకిరీ తప్పదు! అంతవరకూ అయినా హాయిగా కూర్చో.

ఇదుగో మిమ్మల్నే, ఈ గ్లాసు చెయ్యి కాలిపోతోంది. కాస్తంత చల్లారబోస్తారా?

నేను రెండు పురిషెళ్లు నీళ్లు నోట్లో పోసుకు పుక్కిలించి వస్తాను.

రామ! రామ! ఏం నీరసమో కానీ... ఎవళ్ళైనా మాస్తే, నీళ్ళోసుకున్నాననుకుంటారు కూడాను. ఏం చెయ్యను...ఎవళ్ళ కష్టాలెవళ్ళకేం తెలుస్తాయి? వీళ్ళిద్దరికీ చేసుకొచ్చేసరికి ప్రాణాలుపోతున్నాయిరా భగవంతుడా!...





"రాధాకృష్ణుల వసంతోత్సవం"

చిత్రకారుడు రామ మహారాణా

సింహళ భారత

# ప్రాక్పశ్చిమ సమ్మేళ

★ గాజు గిన్నెలపై చెక్కి



రామ మహరాణా [పూరీ]

కళలో ప్రాక్పశ్చిమాలు కలుసుకున్నాయి

ఈ నెల 10 వ తేదీనుంచీ మద్రాసు మ్యూజియం థియేటర్‌లో జరుగుతున్న కాచపాత్రల ప్రదర్శనంలో ప్రాగ్దేశాల చిత్ర కళానైపుణ్యమూ, పాశ్చాత్య శిల్ప ప్రావీణ్యమూ ఏకీభావం పొందాయి

అయిదుగురు భారతీయ చిత్రకారులు, 31 మంది ఇతర ఆసియాదేశాల చిత్రకారులూ చిత్రాలు తయారుచేశారు అమెరికన్ శిల్పులు కాచపాత్రలను, ఫలకాలను మనోహరా కృతులలో తయారుచేసి, వాటిపై ఆ చిత్రాలను తీర్చిదిద్దారు

ఈ కాచపాత్రలు చూపరులను ముగ్ధులుగా చేసే సౌందర్యంతో అలరారుతూ, ప్రపంచంలోని ఆయా అత్యుత్తమ చిత్రకారుల భావనాశక్తిని, శిల్పుల పనితనాన్ని వేనోళ్ళ చాటుతున్నాయి.

ఆసియా దేశాల్లో ప్రసిద్ధికెక్కిన నేటి ఉత్తమ-చిత్ర కారుల చిత్రాలను సేకరించవలసిందిగా న్యూయార్కు పబ్లిక్ లైబ్రరీకి చెందిన కార్ల్‌జుప్‌ను న్యూబెన్‌గ్లాస్ సంస్థ వారు నియోగించారు ఈ సంస్థ కాచశిల్పాలకు కీర్తిగడించినది ఆసియాలో ఈనాడు సృజనాత్మక కళ ఎలావర్ధిల్లుతున్నదో ప్రపంచానికి చాటిచూపాలని ఆ సంస్థ సంకల్పం

న్యూయార్కు పబ్లిక్‌లైబ్రరీ తరపున కార్ల్‌జుప్ అదివరకే చాలాసార్లు ఆసియా దేశాలలో పర్యటన చేసి ఉన్నారు ఆయనకు ఆయాదేశాల చిత్రకళలో పరిచయం ఉన్నది అందుచేత ఏయే చిత్రకారుల చిత్రలేఖన శైలి, పద్ధతి, గాజుపాత్రలపై చెక్కడానికి అనుకూలంగా ఉంటాయో నిర్ణయించడానికి ఆయనకు పూర్తి అర్హత ఉన్నది ఆయన తన అన్వేషణ జపాన్‌తో ప్రారంభించారు. కొరియా, చైనా, ఫిలిప్పీన్స్, వియత్‌నాం, ఆ తరవాత ఇండొనీషియా,



"బృందావనంలో గోపికలు"

# దేశాల చిత్రకళ

# రంలో కొత్త పోకడ

## న అపూర్వ చిత్రాలు ★



చిత్రకారుడు జామినీరాయ్



జామినీరాయ్ [కలకత్తా]

థాయ్‌లాండ్ బర్మా, భారతదేశం సింహళం, పాకిస్తాన్, టర్కీ, ఈజిప్టు దేశాలలో పర్యటించారు

మొత్తం నూరు చిత్రాలు సేకరించారు వీటిలో 36 చిత్రాలను సెలెక్టు చేశారు ఈ చిత్రాలు బౌద్ధ, హిందూ, మహమ్మదీయ భావాలను, సంప్రదాయాలను ప్రతిబింబిస్తున్నాయి గాజు మీద చెక్కబడిన ఈ చిత్రాలు ఒక్కొక్క దానిలో ఒక్కొక్క శైలి కనిపిస్తుంది ఒక్కొక్క భావం కనిపిస్తుంది ప్రతిదానిలోనూ ఒకొక్క ప్రత్యేకత ద్యోతక మవుతుంది

అయిదుగురు భారతీయ చిత్రకారుల్లో జామినీరాయ్ ఒకరు. వీరి చిత్రం "బృందావనంలో గోపికలు" అనే దాన్ని సెలెక్టు చేశారు జామినీరాయ్ ప్రముఖ బెంగాలీ చిత్రకారుడు ఈయనకు కృష్ణగాథలు ప్రీతిపాత్రమైన వస్తువులు

మరొక భారతీయ చిత్రకారుడు ఫణిభూషన్ (కలకత్తా) నిరాడంబరమైన భారతీయ చిత్రలేఖన సంప్రదాయాన్నే అనుసరిస్తూ పశువులను ఇంటికి తోలుకు పోతున్న కర్షకుని చిత్రించారు

మరొక బెంగాలీ చిత్రకారుడు గోపాల్ ఘోష్ తన "వానర యూథం' చిత్రంలో కోతుల చలనలాఘవాన్ని చాలా చక్కగా రూపించ గలిగారు

ఒరిస్సాలో కల్లా ఉత్తమ చిత్రకారుడని పేరొందిన రామ మనోరాణా దేవాలయ కుడ్యాల మీద చిత్రాలు లిఖించడంలో సిద్ధహస్తుడు ఈయన చిత్రం "రాధా మాధవుల వసంతోత్సవం' కాచ శిల్పానికి స్వీకరింప బడినది

కె ఎస్ కులకర్ణి అనే బొంబాయి చిత్రకారుడు "ఖజురాహో దేవాలయ" చిత్రాన్ని తయారు చేశారు ఆధునిక భారతీయ చిత్ర

(32-వ పేజీ చూడండి)

గృహోన్ముఖుడు

చిత్రకారుడు ఫణిభూషణ్ [కలకత్తా]

# ★ ఫణిభూషణ్ ★

అజంతా కుడ్య చిత్రాలు 1819 లో మొట్టమొదటి సారిగా పాశ్చాత్య ప్రపంచంలో గొప్ప సంచలనం కలిగించాయి వాటిలోని చిత్రలేఖన నైపుణ్యం వర్ణవైచిత్రి నిరుపమానమైన వాస్తవికత చూసి అంతా దిగ్భ్రమ చెందారు భారతీయ చిత్రకళలో వాస్తవికత ఆదినుంచీ ఉంటూనే ఉన్నది భావ ప్రధానమైన పాశ్చాత్య కళ ప్రభావం ఎంతగా పడినప్పటికీ, ఆధునిక భారతీయ కళలో వాస్తవికతే ప్రధానంగా పరిగణింపబడుతోంది. దీనికి ఫణిభూషణ్ చిత్రం గొప్ప నిదర్శనం

భారతదేశ ప్రాచీనతను, ప్రాచీన సంప్రదాయాల గొప్పదనాన్ని ఆకళించుకున్న భారతీయ చిత్రకారులలో ఫణిభూషణ్ ఒకరు ఈయన 1919 లో కలకత్తాలో జన్మించారు శాంతినికేతనంలోనూ, కలకత్తా విశ్వవిద్యాలయంలోనూ విద్యాభ్యాసం చేశారు భారతీయ జానపద కథలు, జానపద చిత్రకళ ఆయన ప్రత్యేకంగా అభ్యసించారు. కలకత్తాలోను, ఇతర నగరాల్లోనూ ఆయన తన చిత్రాలు ప్రదర్శిం



ఫణిభూషణ్



బౌద్ధదేవత తారాదేవి :    చిత్రకారుడు : మంజుశ్రీ

## ఫణిభూషణ్

చారు. 1945 లో హార్వర్డు విశ్వవిద్యాలయం, రెండేళ్ల తర్వాత లండను సందర్శించారు.

1952 లో ఆయన స్వదేశం తిరిగి వచ్చారు. అప్పటికొక బాలనాటక సంస్థ ఏర్పడి, ఆయన జీవితాశయం ఒకటి నెరవేరినట్లయింది. కలకత్తా మ్యూజియం ఆవరణలో ఆయన ప్రతి ఏడాదీ బాలకళోత్సవాలు జరిపిస్తూ ఉంటారు. భారత పురాణగాథలు నాటకాలుగా పిల్లల చేతనే ఆడిస్తూ ఉంటారు.

"గృహోన్ముఖుడు" అనే ఈయన చిత్రంలో కర్షకుని దినచర్య సమాప్తం కావడం వస్తువు. నిరంతర జీవిత గమనాన్ని ఇది సూచిస్తుంది. ఈ భావాన్ని ఫణిభూషణ్ వాస్తవికంగా, కొద్ది రేఖలతో చిత్రించారు. వెనకాల ఉన్న వృక్షాన్ని కొంత విపులీకరించి వేశారు. ఈ విపులీకరణం ఒరిస్సా జానపద చిత్ర శైలికి చెందినది. వాస్తవికత, అలంకారమయ శైలి కలసి ఈ చిత్రానికొక విశిష్టతను చేకూర్చాయి.





## మంజుశ్రీ

అనంత కరుణాన్వితుడైన అవలోకితేశ్వరుని బాష్పపూరంలోంచి వికసించిన పుష్పం బౌద్ధదేవత తార. పతిత మానవకోటిని పరిరక్షించడంకోసం బుద్ధ స్వర్గం వదిలిపెట్టి భూలోకానికి వచ్చిన బోధిసత్వుడే తారాదేవిని సృజించాడు. ప్రజ్ఞకు, శాంతికీ, దీక్షకు, ఉత్తమ జీవితానికి చిహ్నం తారాదేవి. ఇదిమహాయానుల నమ్మకం.

ఎల్. టి. పి. మంజుశ్రీ చిత్రించిన తారాదేవి ఆచిత్రంలో దేవికీ, ప్రకృతికీ తాదాత్మ్యం కనిపిస్తుంది. ఆమె హస్తంలోని లీలాకమలం ఆమె దివ్యత్వానికి చిహ్నం. ఆమె భంగిమలో 'శ్రద్ధ' కనిపిస్తుంది. శివి గోచరిస్తుంది.

చిత్రకారుడు మంజుశ్రీ సింహళీయుడు. 1902 లో అలుత్ గామ గ్రామంలో జన్మించారు. చిన్నతనంనుంచీ బౌద్ధమత వాతావరణంలో పెరిగారు. పదమూడవఏట సన్యాసియై, పాళీ, సంస్కృతం, సింహళీయ భాషలలో బౌద్ధగ్రంథాలు చదువ నారంభించారు. ఆ తరువాత శాంతినికేతనం వెళ్ళి జపానీస్ బౌద్ధమతాన్ని గూర్చి పరిశోధన చేశారు.

ఈలోగా ఆయన చిత్రలేఖనం కూడా మొదలు పెట్టారు. ఆయన కొక ప్రత్యేక శైలి అలవడింది. 1948 లో ఆయన నొక కళాభిమాని లండన్, పారిస్, వియన్నా పంపించారు. ఆ నగరాల్లో ఆయన తన చిత్రాలు ప్రదర్శించారు. అప్పటినుంచీ ఆయన చిత్రకళపైన, ముఖ్యంగా బౌద్ధచిత్రకళపైన శ్రద్ధ కేంద్రీకరించారు. ఆయన ఇష్టదేవి తార.



# ★ సింహళ భారతదేశాల చిత్రకళ ★

(29-వ పేజీ తరువాయి)

కళలోని ద్వైవిధ్యభావం ఈయన చిత్రాలలో కనిపిస్తుంది. సనాతన అధునాతన శైలుల సమ్మేళనం ఈయన ప్రత్యేకత.

అయితే ఆయా చిత్రకారుల కళా ప్రతిభ యావత్తూ దానంతట అదే గాజుపాత్రల పైకి యథాతథంగా తర్జుమా కాదు. గాజు పాత్రలు నిర్మించే శిల్పికూడా ప్రతిభావంతుడైతేనే ఆ చిత్రాలు రాణిస్తాయి.

స్ట్యూబెన్ గ్లాస్ సంస్థవారికి ఇదివరకే మాటిస్సీ, లారెన్సిన్, గిల్, గ్రాంట్ వుడ్ మొదలైన ప్రముఖ పాశ్చాత్య చిత్రకారులతో 1980 ప్రాంతాల నుంచే అనుభవం ఉన్నది. వారి చిత్రాలను గాజుపై చెక్కడంలో ఆ సంస్థ కీర్తిగడించి ఉన్నది.

ప్రస్తుత ప్రదర్శనంలోని కళాఖండాలలో, అసలు చిత్రాల భావోద్వేగ్నతను యథాతథంగా గాజుపైకి తీసుకురావడానికి స్ట్యూబెన్ శిల్పులు ప్రయత్నించారు. పాత్ర ఆకృతి నిర్ణయించడం దగ్గిర్నుంచి దానిపై చిత్రం చెక్కడం వరకూ అంతా ఆయా దేశాల మత, జాతీయ భౌగోళిక వాతావరణాన్ని దృష్టిలో పెట్టుకుని, ఆ వాతావరణం చూపరులకు స్ఫురించేలా కృషిచేశారు.

గాజుపాత్ర తయారుచేసేవాడు, చిత్రం చెక్కేవాడు ఎంతో నిపుణుడైతే తప్ప మొత్తం అంతా ఒక సుందర కళాఖండం అనిపించదు.

ప్రాగ్దేశాల చిత్రకళ, పాశ్చాత్య కాచ శిల్పం కలిసి తాదాత్మ్యం పొంది ఆహ్లాదకరమైన కళగా రూపొందాయి.

మొదట వాషింగ్టన్‌లోని నేషనల్ గాలరీ ఆఫ్ ఆర్ట్‌లోనూ, తరవాత న్యూయార్కులోని మెట్రోపాలిటన్ మ్యూజియం ఆఫ్ ఆర్టులోనూ వీటిని ప్రదర్శించారు. తరవాత ఈ ప్రదర్శనం కొరియా, జపాన్, హాంకాంగ్, ఫిలిప్పీన్స్, వియత్నాం, ఇండొనీషియా, థాయిలెండ్, బర్మా, భారత దేశాలలో జరుగుతూ వచ్చింది. ఈ దేశంలో కలకత్తా, ఢిల్లీ, బొంబాయి నగరాలలో ఈ ప్రదర్శనం ఇదివరకే అసంఖ్యాక కళాభిమానులను ఆకర్షించి ప్రశంసలు చూరగొన్నది.

## రామమహోరాణా

వసంతరాత్రి. చల్లనివెన్నెల కాస్తోంది. యమునాతీరాన నిభృతనికుంజ గృహంలో పండుటాకుల పాన్పుమీద కూర్చుని, మురళిపై విరహగీతం ఆలాపిస్తూ రాధకోసం ఎదురుచూస్తున్నాడు కృష్ణుడు.

ఇది నిజంగా చరిత్రలో జరిగిందో లేదో గాని, మురళీకృష్ణునివిరహగీతం యుగయుగాలుగా భక్తుల హృదయాలను రసపరవశం చేసింది. కవులచేత కావ్యాలు, చిత్రకారుల చేత చిత్రాలు వ్రాయించింది.

ఇలా కృష్ణ కథామృతం ఆస్వాదించి, ఆ ఆనందాన్ని చిత్రాలుగా వ్యక్తపరచుకున్న గొప్ప చిత్రకారులలో ఒరిస్సాకు చెందిన రామమహోరాణా ఒకరు. ఈయన 1905 లో జన్మించారు. వీరిది స్వతహాగా చిత్రకారుల వంశం. వీరివృత్తి దేవాలయాలలో కుడ్య చిత్రాలు చిత్రించడం. పూరీకి సమీపంలో వీరి నివాసం. చేనేతవస్త్రంతో చేసిన కాన్వాసుపై వీరు చిత్రిస్తారు. ఆవస్త్రంపై చింతగింజలపొడి ముద్దచేసి పూసి, దానిపై సున్నపుపూత పూసి, దానిపై చిత్రిస్తారు. స్థానికంగా లభించే మూలికావర్ణాలనే వాడతారు. పూరీప్రాంతంలోని దాదాపు వందమంది చిత్రకారులలోనూ రామమహోరాణాదే అగ్రతాంబూలం.

వీరు రచించిన "రాధా మాధవుల వసంతోత్సవం" ఈ ప్రదర్శనానికి స్వీకరింపబడినది,

## జామినీరాయ్

జామినీరాయ్ జగత్ప్రఖ్యాత వంగ చిత్రకారుడు. ఆయన చిత్రాలు ప్రపంచమంతటా ప్రదర్శితమైనాయి. ఆయన సిద్ధాంతాలు ఎందరినో ఆకర్షించాయి. కాని వ్యక్తిగా జామినీరాయ్‌నిగూర్చి మనకంతగా తెలియదు. 1887 లో బెలియతూర్ లో జన్మించారు. ఉన్నతవిద్య ఏమీ అభ్యసించలేదు. కలకత్తా స్కూల్ ఆఫ్ ఆర్ట్‌లో కొంతకాలం పనిచేశారు. అసలాయన పోర్ట్రెయిట్ కళాకారుడుగా పైకిరావాలని అనుకున్నారు. ఆయన వేసిన పోర్ట్రెయిట్లు ఇప్పటికీ చాలా ఉన్నాయి. 1921 నుంచీ ఆయన సాంప్రదాయిక కళను త్యజించి, బెంగాలీ జానపద కళను, హిందూ వేదాంతాన్ని పరిశోధించసాగారు. ఇవే ఆయన కళకు పునాదులయ్యాయి. ఒక కొత్త జామినీరాయ్ అవతరించినట్లయింది. ఆయన భావన ఎంతవిశృంఖలమో రేఖావిన్యాసంకూడా అంత విశృంఖలం. అయినా ఆయన చిత్రాలలో ఏదో విశ్వజనీనమైన సందేశం అంతర్వాహినిగా ఉంటూనే ఉంటుంది.

వ్యక్తిగా ఆయనకి కొంచెంబిడియం జాస్తి. ఏకాంత ప్రియుడు. కలకత్తాలోని తన స్టూడియోలోనే నివసిస్తూ, ఎప్పుడూ ఏదో ఆలోచనలో, ధ్యానంలో, పనిలో, పరిశోధనలో మునిగి ఉంటారు. గోడలనిండా ఆయన చిత్రాలు వ్రేలాడుతూ ఉంటాయి. ఆయన ఇద్దరు కుమారులు చేదోడు వాదోడుగా పని చేస్తూ ఉంటారు. ఆయనను దర్శించడానికి తీర్థప్రజలా బోలెడుమంది వస్తూ ఉంటారు. జామినీరాయ్‌కి ప్రీతిపాత్రమైన చిత్రలేఖన వస్తువు కృష్ణలీలలు.

కృష్ణుడు యమునాతటాన రాసక్రీడకు వస్తానని గోపికలకు మాట ఇస్తాడు. అతని మాట నమ్మి గోపికలు వెన్నెల రాత్రిలో ఇళ్లూ వాకిళ్లూ వదిలి అభిసారికలై వస్తారు. చెట్లూ, పొదలూ అన్నీ వెదుకుతారు. కృష్ణుడు కనిపించడు. విరహవేదనలో గోపికలు తపించిపోతారు.

జామినీరాయ్ రచించిన "బృందావనంలో గోపికలు" చిత్రంలోని భావం ఇది.



గుర్తొస్తూ ఉంటాయి లెండి) భోజనం చేయటం మొదలు పెట్టాను. అప్పుడే అందరూ చారుదాకా వచ్చేశారని, ఒక చూపులో గ్రహించి, ఒక వాయి మినహా నేనుకూడా చారులోకే వచ్చానని నిర్ధారణ చేసుకున్నాను.

"వేడిచారు బాబూ... వేడి చారు..." అంటూ రంగడు గరిటె పుచ్చుకొనివచ్చాడు. వాణ్ణి చూస్తే, నిజంగా. విరాట రాజు కొలువులో భీముడు గుర్తొచ్చాడనుకోండి.

"ఎవరేడిశారురా" అని అడిగాను వాడిని ఛలోక్తిగా... నా తెలివికి, నా సమయస్ఫూర్తికి నేను గర్వపడదామనుకుంటూ వుండగానే, "ఏడిశావు లేవోయ్" అన్నాడు. "దచ్చిరి సోదరుల్ సుతుల్..." అనే పద్యం కొంచెందాకానే గుర్తొచ్చి ఆగిపోయింది. ఎందుకంటే, నాకా పద్యం రాదు కాబట్టి. ఏడుద్దామనిపించింది గట్టిగా, నోరారా, హాయిగా, తనివితీరా... తీరని పరాభవమైంది, కాని ఇంతలోకే, అప్రయత్నంగా చారు అన్నం నోట్లోకి నా చెయ్యి పెట్టివేయటంతో, ఇందాకటి అధ్యాయంలో వచ్చిన ఆలోచనలకి బందయివాయి.

కిక్కురు మనకుండా చారన్నం అంతా తినేసి, మజ్జిగకోసం ఎదురుచూడటం మొదలుపెట్టా... అంతలో, ఇందాకటి, మా రంగడి బావమరది..., వాడి స్నేహితుడు మజ్జిగలోకి అన్నం పట్టుకవచ్చాడు. అందరికీ వడ్డిస్తూ, నా పక్కనున్న బ్రాహ్మణుడి దగ్గరకూడా వచ్చి "అన్నమండి... శాస్త్రుల్లుగారూ" అన్నాడు. "ఆఁ ఆఁ ఎంతోవద్దు... కొద్దిగా, కోడిగుడ్డంత వేయండి చాలు" అన్నాడాయన.

"నాకు, ఎవరో నా వీపు చరిచినట్టయి, గ్లాసులో ఉన్న మంచినీళ్లన్నీ తాగేసి, ఈయన అన్నటువంటి మాటనుగూర్చి ఆలోచించటం మొదలుపెట్టా.

ఎవరైనా నిమ్మకాయంత అన్నం వేయమంటారు గాని, కోడిగుడ్డంత గాని, బాతుగుడ్డంతని గాని, అడుగుతారా అని సందేహం వచ్చింది. ఈయన చూడొస్తే స్వచ్ఛమైన వైదిక బ్రాహ్మణుడు లాగా ఉన్నాడు, కోడిగుడ్డు అనే పదం ఆయన నోట్లోకి ఎందుకు వచ్చిందా అనే అనుమానం కూడా వచ్చినమాట నిజం.

"భోజనకాలే గోవింద నామస్మరణ గోవిందా!" అంటూ పోలోమని అందరూ లేవడంతోటి, నేను కూడా లేచి, చెయ్యి కడుక్కుని, లోపల గదిలో కెళ్ళి కుర్చీలో కూలబడ్డాను. నాకేమిటో, ఆ "కోడిగుడ్డంత" అనే మాట చెవుల్లో రింగు రింగు మని రొద చేయటం మొదలెట్టింది.

ఏమైనా సరే, దీని అంతేదో తేల్చుకోవాలని చొక్కా వేసుకుని పెద్ద డిటెక్టివ్ లాగా బయలుదేరాను. డిటెక్టివ్ లాగా అంటే, నేనేమీ సిగరెట్టుపీకలు అగ్గిపుల్లలుఏరలేదు, వేలిముద్రలు వెతకలేదు, ప్లిమత్ కారుమీద తుర్రు మనాలేదు.

తిన్నగా వీధి మలుపు తిరుగుతున్న ఆ ఇందాకటి మనిషిని వెంటాడేను. వెనకాలే వెళుతున్నా నన్నమాటేగాని, ఏమని అడగాలో తెలియక మధనపడ్డాను. నేనేమన్నా అంటే, తంతాడేమోనని కొంచెం భయం లాంటిది వేయటం మొదలు పెట్టింది. కాని, నేనొక కాలేజీ స్టూడెంటుని, అందులోనూ, పురుషవరేణ్యుణ్ణి అనే విషయం గుర్తొచ్చి (చటుక్కునే అనుకోండి) ఆయన రెండు కొడితే, నేను ఒక్కటన్నా కొట్టలేనా అన్నంత ధైర్యం వచ్చినట్లయి, "ఏమండోయ్" అని మాత్రం అనగలిగాను.

ఆయన నెమ్మదిగా వెనక్కి తిరిగి, నా వైపు బెదురుచూపులు చూడటం మొదలు పెట్టాడు ఆయన కొద్దిగా వణికినట్లుకూడా కనిపించి, నీళ్ళు కూడా నములుతున్నట్లు గోచరిస్తే, నాకు ఎక్కడలేని ధైర్యం వచ్చినట్లయింది. "నీ పేరేమిటి, నీ యిల్లెక్కడ" అని, ఈసారి గట్టిగా అన్నాను.

ఆయన తన గుట్టంతా నాకు తెలిసిపోయిందనుకున్నాడో, ఏమో, బోనులో ఎలకలాగా అయిపోయి, గొలుసులతో బంధించిన ఏనుగులాగా అయిపోయి, ఇంకా ఏమిటో కూడా అయిపోయి, నా రెండు చేతులూ పుచ్చుకుని, కళ్ళ నీళ్ళు పెట్టుకొని, "బాబ్బాబు"...ఎవ్వరికీ చెప్పకండి బాబు, మీకు పుణ్యముంటుంది" అన్నాడు. "ఏమిటయ్యా...అది" అన్నాను, గదమాయింపుగా... "బాబుగారు...ఏదో పిల్లలుగలోణ్ణి —పెరటి వీధి వెంకన్న కాపు గారి పాలేరోడి బాబాయిని...పూటగడవక, ఇలా వేసమేసి, అందర్నీ మోసగించాను. బుద్ధి తక్కువపని చేశాను...బాబూ రక్షించాలి... ఇంకెప్పుడు ఇలాంటి పనులు చేయను. ఇదిగో లెంపలు వేసుకుంటున్నాను. చాలా" అంటూ రెండు చెంపలూ వాయించుకుని, ఏడవడం మొదలెట్టాడు. వాడి ఏడుపు చూచి, నాకూ ఏడుపొచ్చినంత పర్యంతమైంది.

దక్షిణ డబ్బులు వదలి వెళ్ళిపోతున్న వాడిని పిలిచి, ఆడబ్బులు వాడికే ఇచ్చి, ఈవిషయం ఎవ్వరికీ చెప్పనని వాడికి ధైర్యం చెప్పి, చొక్కా కాలరు సవిరించుకుంటూ, విజయగర్వంతో ఇంటికొచ్చాను. అంతా బాగానే ఆడాడు నాటకం కాని చివరలో రసాభాసయినందుకు మాత్రం నేను విచారించాను. మొత్తానికి వాడు అసాధ్యుడే ననిపించాడు నాకు మటుకు నాకు.

ఈ సంగతి ఎవ్వరికీ చెప్పలేదు, ఇంతవరకు మీతో తప్ప...ఎవ్వరికీ చెప్పకండే...★

# కోడి గుడ్డంత...

"ఏరా! రంగా...ఒంటి గంటయినా భోజనాలు లేవా? పెళ్ళి హడావుడిలో వుండి మా భోజనాలమాటే మర్చిపోతున్నావేమిటి?" అని, మా రంగడిని అడక్క తప్పిందికాదు. ఏం చేస్తాను చెప్పండి, ఆత్మారాముడు అల్లరి చేస్తుంటే.

"అల్పే లేదురా! అంతా అయిపోయింది. ఇంకేమీ ఆలస్యం లేదు. విస్తళ్ళు వేయటం, భోజనానికి పిలవటం. అన్నట్లు నువ్వు ఆ సావిట్లో ఉన్న బ్రాహ్మణుల్ని మడి కట్టుకోమని చెప్పి, నువ్వుకూడా మడి కట్టుకుని భోజనానికి రా! ఇంతలో నేను మిగిలిన ఏర్పాట్లు చేస్తాను" అంటూ పంచె చెంగు దోపుకుంటూ వంటింటివేపు వెళ్ళాడు, రంగడు, నేనేదో చెబుదామనుకుంటూ వుండగానే.

నే చెప్పేదేమిటో వినిపించుకోకుండా వెళ్ళాడంటే, చెప్పినపని తప్పక చేసి తీరతానని, నామీద అంత నమ్మకమన్నమాట వాడికి. బాగానేవుంది. ఇంకేదైనా సందర్భంలో నా సిన్సియారిటీకి నేను గర్వపడి ఉండేవాడినేమో కాని, ఇప్పుడుమాత్రం, నవ్వాలో, ఏడవాలో తెలియలేదు.

నెమ్మదిగా సావిట్లోకి వెళ్ళాను. ఈ బ్రాహ్మళ్ళపని బాగా వుందనిపించింది. ఏవో నాలుగు మంత్రాలు చదివి, తనివితీరా భోంచేసి, దక్షిణ డబ్బులు పుచ్చుకుని ఉడాయిస్తారు. పిలకలు వదులుచేసి, ఝాడించి, ముడివేసుకుంటూ కొంతమంది, విసనకర్రలతో విసురుకుంటూ కొంతమంది, పొడుం పీలుస్తూ కొంతమంది...ఇలా కూర్చొని ఉన్నారు, ఆ బ్రాహ్మణులంతా...

"ఏమండోయ్ ... ఇంక మడికట్టుకుని భోజనాలకి లేవచ్చుట" అన్నాను నేను, నా పట్టుపంచె కుచ్చిళ్ళు సవరిస్తూ...

"అయ్యో...ఇదిగో ఎంతసేపు...వస్తున్నాం" అంటూ లేచి మడిపంచె కట్టుకుంటున్నాడు ఒక బ్రాహ్మణోత్తముడు.

ఎందుకో, నా దృష్టి ఆయన మీదికి పోయింది...ఆయనకూడా, అందరి బ్రాహ్మణుల మల్లే ఉన్నాకూడా, ఏదో కొంత తేడా, వెలితీ ఆయనలో కనిపిస్తున్నట్లు తోచిందినాకు. ఆజంధ్యం సవరించుకోవటం, మొదలైనవన్నీ చూస్తుంటే, బాగా శాస్త్రాలు చదివిన వాడిలాగానే కనపడ్డాడు నాకంటికి. "ప్రతి చిన్న దానికీ, ఏదో ఒకటి పట్టుకుని ఆలోచిస్తూ కూర్చొనే జబ్బు పట్టిందిరా నాయనా నీకు" ఎవరో ఎప్పుడో అన్నమాట నాకు గుర్తుకొచ్చి, నా ఆలోచనలకి ఒక ఫుల్ స్టాప్ పెట్టి, భోజనాల హాల్లోకి వచ్చాను.

"అలా కూర్చోరా...వడ్డించేస్తున్నారు"

## ఏడిద వెంకట సత్యనారాయణమూర్తి

అన్నాడు మా రంగడు. ఆమాట అనటమే తడవుగా నేను ఉన్నపళంగా కూలపడ్డాను, ఒక పక్కగా. తీరా చూద్దును కదా, ఇందాకటి నా ఆలోచనలకి కారణమైన బ్రాహ్మణుడు నా పక్కనే కూర్చొని ఉన్నాడు. ఏవో మంత్రాలు కాబోలు బఠాణీలు నమిలినట్లు, చదువుతున్నాడు నోట్లోనే, కళ్లు మూసుకుని. ఈ బ్రాహ్మణున్ని చూసి, మిగిలిన వాళ్ళలో కొంతమంది, 'మనం కూడా ఏవో కొన్ని మంత్రాలు చదవకపోతే ఏమైనా అనుకుంటారు' అనుకుని ఏవో నాళ్లా నెమరు వేస్తున్నారు.

అంతలోకే, 'నెయ్యి, నెయ్యి' అంటూ మావాడి బావమరది మావగారి పెత్తల్లి కొడుకు స్నేహితుడుట, వాడొచ్చాడు. "ఆఁ. ఇలా పొయ్యండి బాబూ" అన్నాడు నా పక్కనున్న బ్రాహ్మణుడు. కాని పీకి తస్సాగొయ్య...నెయ్యి పొయ్య మంటున్నాడు, నెయ్యమనటం పోయి...నాకు భలే కోపమొచ్చింది. కాని, మావాడి బావమరది...మొదలుగాగల వారియొక్క కొడుకు స్నేహితుడు..., ఆయనకు నెయ్యి పోసి, చక్కాపోయాడు. ఈయనే అర పావెడు నెయ్యి ఒక్క పప్పు వాయలోనే కలిపాడే, భోజనం అంతా అయ్యేటప్పటికి, ఈయనొక్కడూ పోలడు తక్కువగా వీశె నెయ్యి లగాయించేటట్లు కనబడ్డాడు నాకు.

ఈయనకి నెయ్యి ఎంత పడుతుందో అని మాత్రమే ఆలోచిస్తున్నాననీ, నేను భోజనం చేయటంలేదనీ, నాకు చటుక్కున గుర్తుకొచ్చి (నాకు ఇలాగే చటుక్కుని

# వనితా లోకం

## భార్యలు - భర్తలు

మతుకుమల్లి సుశీల
[తిరుపతి]

ఈమధ్య మా ప్రక్క యింట్లోకి ఒకరు క్రొత్తగా కాపురం వచ్చారు. ఎక్కడి నుంచో హఠాత్తుగా బదిలీఅయి వచ్చారుట. వాళ్ళ అమ్మాయికి టి. సి. తీసుకువచ్చి ఇక్కడ స్కూలులో చేర్పించాలంటే ఒక పట్టాన చేర్చుకోలేదు. ఐదారుసార్లు స్కూలుకి తిరగవలసివచ్చింది.

అయనేమో 9 గంటలకి ఆఫీసుకి వెళ్ళి సాయంత్రం అయిదుగంటలకి తిరిగివస్తారు. కాబట్టి స్కూలు టైములో వెళ్లేందుకు తీరదు.

అవిడ వెళ్ళాలంటే, "నాకు భయం. నా కలవాటులేదు. అక్కడివాళ్ళతో యెలా మాట్లాడాలో తెలియదు" అంటుంది.

"ప్రతిసారీ శెలవు పెట్టాలంటే ఎలా" అంటాడు భర్త.

ఈ సమస్యకు పరిష్కారమార్గం కనుపించలా. చివరికి ఆ అమ్మాయే స్వయంగా వెళ్లి చేరిందనుకోండి.

ఇంట్లో నలుగురు మనుష్యులుంటే ఫరవాలేదు గాని, భార్యాభర్తలు చిన్నపిల్లలతో ఉండేసంసారాల్లో ఇలాంటి ఇబ్బందులు చాలా ఉంటాయి. సాధారణంగా ఈ రోజుల్లో పెద్ద దిక్కువుండే సంసారాలు తక్కువ. ఎందుచేతనంటే చిన్నవాళ్ళు ఉద్యోగరీత్యా పొరుగూళ్ళకు వెళ్ళక తప్పదు. పెద్దవాళ్ళు ఉన్నవూరు, పొలం, పుట్రా వదలిరారు. కాబట్టి ఈవిధమైనసమస్యలకి పరిష్కారమార్గం ఆలోచించటం అవసరం.

భార్య, భర్త అనే పదాలు భాషలో పుట్టినపుడున్న అర్థానికీ, ప్రస్తుతం వాడుకలోవున్న అర్థానికీ ఏవిధమైన సంబంధం లేదు. దీనికి కారణం నిత్యనూతనంగా మారిపోతున్న మన సాంఘికవ్యవస్థే కావచ్చు. మొదట్లో, భార్య అనగా 'భరింపబడునది' అని, భర్త అంటే 'భరించువాడు' అను అర్థాలతో ఈ పదాలు సృష్టించబడ్డాయి.

### అర్థాలు

పూర్వం ఎవరి కులవృత్తులు వారు చేసుకునే రోజుల్లో బ్రాహ్మణులు సంస్కృతాధ్యయనం, వేదపారాయణ ఇత్యాదులు చేసుకుంటూ వుంటే ఏ మహారాజులో దానంచేసిన అగ్రహారాదుల మీది ఆదాయంతో భుక్తిగడచిపోయేది. కాబట్టి వంట తప్ప, ఇంటికి సంబంధించిన సమస్తమైన విషయాలూ స్వయంగా గాని, ఇతరుల సహాయంతోగాని పురుషుడే (యింటి యజమాని) చూసుకునేందుకు వీలుండేది. ఈవిధంగా ఒక్క బ్రాహ్మణులకే కాక అన్నివర్ణాల వారికీ వంశపారంపర్యంగా వచ్చే మాన్యాలుగాని, అటువంటి ఇతర ఆధారాలుకాని ఉండేవి. కాబట్టి ఆరోజుల్లో పురుషులు సంసారభారం అంతా 'భరిస్తుంటే' స్త్రీలు వంటావార్పూ, అతిథి అభ్యాగతి సత్కారం చూసుకుంటూ, భర్త భార్య అనేపదాలను సార్థకపరచేవారు.

ఈనాడు ఈ రెండు పదాలు దంపతులలో స్త్రీ పురుషులను సూచించే పేర్లుగా మాత్రం నిలిచిపోయాయి. కారణం, అన్ని రంగాలలో స్త్రీపురుష సమానత్వం సాధించాలనే అవిరళ కృషి కావచ్చు. ముఖ్యంగా స్త్రీలలో ఇంతవరకూ తమ కేదో అన్యాయం జరిగి పోయిందనే భావన, ఇకముందైనా దీనిని ప్రతిఘటించాలనే సంచలనం, కలిగాయి. ఇంతవరకూ బాగానేవుంది. కాని పురుషులతో సమానంగా అన్ని హక్కులూ కావాలనుకునే ముందు, హక్కులకీ, బాధ్యతలకీ అవినాభావ సంబంధం వున్నదనీ, అరెండూ విడివిడిగా వుండవనీ మన మహిళలు గ్రహించినట్లు తోచదు.

### అనర్థాలు

మన అమ్మలో, అమ్మమ్మలో అయితే భర్త యింట్లోకి కావలసిన వస్తువులన్నీ తెచ్చి, యిచ్చి, పై ఖర్చులకి రోజాపావలో, అర్ధో యిస్తే తృప్తిపడి ఊరుకునేవారు. అధునాతన స్త్రీ మనస్తత్వం యిలావుండదు. కాపురానికి వచ్చిన మర్నాటినుంచీ (ముఖ్యంగా ఒంటరి కాపురాలవటంవల్ల) భర్తమీద అధికారం చెలాయించబోవటం, జీతం తెచ్చి తనచేతికి యివ్వలేదని సుసుస్తూ కూచోవటం, ఆ కారణంగా అలిగి కూర్చోవటం మొదలైనవి జరుగుతుంటాయి. అంటే యీ రోజుల్లో ప్రతి స్త్రీ ఇలాగే చేస్తున్నదని కాదు. ఏక్కువచోట జరుగుతుంటుంది.

ఈ విధంగా అధికారం చేయటంలో సమానత్వం ఎక్కడవున్నది? భర్త భార్యను తన అదుపాజ్ఞలలో పెట్టుకోవటం నేరమైతే భార్య భర్తను లొంగతీసుకోవాలనుకోవటం అంతకన్న ఘోరమైన అపరాధం. సంసారంలో కావలసినది పరస్పర సామరస్యం కాని అధికార వినియోగం కాదు. అలాగే కొత్త కాపురాల్లో జీతం, భర్త జాగ్రత్తలో వుండటమే మంచిది. అతను వయసులో కనీసం 5, 6 ఏళ్ళు పెద్దవాడుకాబట్టి భార్య సంసారరంగంలో ఆరితేరేవరకూ అతడే డబ్బునుగురించి జాగ్రత్తపడటం వాంఛనీయం.

కానీకీ అర్ధణాకీ ఒకరిదగ్గర చేయి చాచాలంటే కష్టంగా వుండదా? అనవచ్చు. జీతమంతా మనకిచ్చేసినపుడు ఈ ప్రశ్నే పురుషులూ అడగవచ్చుగా? 'ఎవరు ఖర్చుపెడుతున్నారు' అనే దుగ్ధలో బాధపడకుండా ఇద్దరికీ అందుబాటులో నుండేచోట డబ్బు వుంచి, అణా, బేడా కాక రూపాయ్య ఖర్చుచేసేప్పుడు పరస్పరం సంప్రతించుకో చేయటం మంచిది.

ఆడవాళ్ళు జీతమంతా 1వ తేదీకళ్ళురుని

(42-వ పేజీ చూడండి)





# కొత్త

అందరూ కుట్టినటువంటి డిజైనులే కుడితే తృప్తి వుండదు. ఎంతో మంచి డిజైనైతే తప్ప అందరూ కుట్టినటువంటిది కుట్ట బుద్ధికాదు. ముఖ్యంగా పూల గుత్తులు కుట్టీకుట్టీ మొగం మొత్తినవాళ్ళకి ఇవొక కొత్త డిజైనులు. పూవులు అవి కుడుతున్నప్పుడు ఏమాత్రం తప్పొచ్చినా కొట్టొచ్చినట్లు కనబడిపోతుంది వీటికిమాత్రం ఆ భయం లేదు. అందుకే ఇటువంటి డిజైనులు నాకిష్టం ఏదీ తోచకపోతే ఆకీనులు, కళావరులు, డైమను లన్నా గీసుకు కుడతాను గాని పువ్వుల డిజైనులు కుట్టడానికి సాధారణంగా పూనుకోను.

ఎప్పుడూ ఒకేరకమైన పువ్వులు, ఆకుల్కు, చిలకలు, హంసల్లే కాకుండా కొత్త రకాలు కుడుతూంటే ఆకర్షణీయంగా కూడా వుం

**★ పి. సరళా**

టుంది. ఇవికుట్టడం ఏమంత పెద్దకష్టంకాదు. డిజైను చూసినపుడు కంటికి నదురుగా కనబడకపోయినా కుట్టిచూస్తే చాల బాగుంటుంది. అందులోనూ డబుల్ కలర్స్ దారాలతో కుడితే షేడ్ వస్తూ మరీ బావుంటాయి.

అసలు ఏ డిజైనులన్నా, పుస్తకంలో చదివినట్టూ, ఎక్కడో చూసినట్టూ కాకుండ ఆలోచిస్తే ఎన్నో రకాలుగా కుట్టొచ్చు. ఎవరయినా మాట్లాడుతున్నపుడు చూడండి: 'అలా ఎందుకు కాకూడదూ', ఇలాఎందుకు కాకూడదూ' అని అడ్డుప్రశ్నలు వేస్తామే అలాగే ఇదికూడ 'అలాకుడితే ఎలా వుంటుంది', 'ఇలా కుడితే ఏమవుతుంది' అని ఆలోచిస్తే ఒక్కొక్క డిజైను ఎన్నోరకాలుగా కుట్టవచ్చునన్న సంగతి తెలుస్తుంది.

ఇప్పుడిచ్చిన డిజైను లన్నీ చైన్‌స్టిచ్ (గొలుసుకుట్టు) తో నయినా, స్టెమ్‌స్టిచ్ (కాడకుట్టు) తో నయినా పూర్తిగా నింపవచ్చు మొదట డిజైను ట్రేస్ తీసుకుని, ఎవరికి ఏకుట్టు (పై రెండింటిలో) ఇష్టమో, ఆ కుట్టుతో ఔట్ లైనంతా కుట్టుకోవాలి. ఆ తరువాత ఆ లైను పక్కనే డిజైనులోపలి

# డిజైనులు

పక్కగా మళ్ళీ అదేకుట్టు కుట్టాలి ఒకవరస పక్క ఒక వరస, అలా కుట్టుకుంటూ డిజైనంతా నింపేయాలి. మొదటే చెప్పాను కదూ! డబుల్ కలర్సయితే బావుంటుందని. డబుల్ కలర్సు లేకపోతే ఒకరంగు దారంలో ఒకపోగు, ఇంకోరంగులో ఇంకో పోగు- బాగా నప్పే రంగులు కలిపి ఎక్కించి కుట్టినా బాగుంటుంది.

ఇలా డిజైనునిండా నింపి కుట్టలేని వాళ్లు మూడు వరసలుగాని, ఐదు వరసలు గాని, కుట్టి మిగిలింది ఖాళీగా వదిలేసినా బాగానే వుంటుంది అయితే మరీ బద్ధకించి, ఒకవరస అంటే, ఔట్ లైను మాత్రం గొలుసుకుట్టుతో నింపేసి వదలకండి.

ఈ డిజైనుల్ని "అప్లిక్" వర్కు కూడా చెయ్యొచ్చు దానికైతే, ఈ అప్లిక్ చేసే బట్ట అంతా ఒకేరంగు అయితేనే బావుంటుంది. ఈ బట్ట మందపాటిదీ వెలవనిదీ వుండాలి. రంగులు ఎవరి అభిరుచిని బట్టి వారు నిర్ణయించుకోవచ్చు ఆ రంగు బట్టమీద ఈ డిజైను ట్రేస్ తీసి, ఔట్ లైన్ తరువాత 1/8 అంగుళం గుడ్డ వదలి నేర్పుగా కత్తిరించాలి. ఈ కత్తిరించిన డిజైనుని మనకి కావలసిన గుడ్డమీద కదలకుండా వుండేటట్టుగా పెట్టి,చుట్టూ టాకాలువేసుకోవాలి. ఆపైన ఔట్ లైనంతా బటన్‌హోల్ స్టిచ్ (కాజా కుట్టు)తో, 1/8 అంగుళాల బటా కనబడకుండా, ఆ రంగుబట్టకు నప్పే రంగుదారముతో కుట్టుకోవాలి ఇపుడు లోపలి గీతలన్నీ సన్నగా కాడకుట్టుతో కుట్టుకుంటూ వస్తే డిజైను పూర్తవుతుంది. కొనలూ, దారాలూ పైకి రాకుండా కుట్టుకుంటే ఈ "అప్లిక్" చాల బావుంటుంది.

ఓపిక వున్నవాళ్ళూ, ఇష్టం వున్నవాళ్లూ మద్దకుట్టుతో కూడా ఈ డిజైను కుట్టుకోవచ్చు డబుల్ బాక్ స్టిచ్ (ఇంటూకుట్టు)తో డిజైనంతా కుట్టి, తరువాత గీతలన్నీ కాడకుట్టుతో కుట్టినా బాగానే వుంటుంది ★

దేవి 








## ప్రకృతిప్రసాదించిన పరమౌషధాలు: (5)

(గతవారం తరువాయి)

### తేలుకాటు

తేలుకుట్టినచోట స్వచ్ఛమైన తేనెతో మర్దనచేసి, గుడ్డతో పుగబట్టాలి. తేనె లోపలికికూడ పట్టించాలి. (తేలు కాటుకు ఒకొక్క తత్వంవారికి ఒక్కొక్కమందు చటుక్కున పనిచేస్తుంది, యేది యెవరి కుపయోగిస్తుందో చెప్పుట కష్టం. అన్ని తెలుసుకొనుట మంచిది.)

#### కాల్పులకు:

కాలిన తక్షణం తేనె, తాజావెన్న కలిపి పూస్తే చాలా గుణమిస్తుంది.

#### మూత్రపిండములకు:

అనేక కారణాలవల్ల మూత్రపిండములు, మూత్రకోశము పాడగుచున్నవి. తద్వారా అతి మూత్రమనే వ్యాధి సంక్రమిస్తుంది. ఇది 20 మేహములలో నొకటి. (1. కఫజములు పది, 2. పిత్తజములు ఆరు, 3. వాతజములు నాలుగు.

ఈ మేహము లన్నియు సకాలంలో చికిత్స చేయబడనిచో మధుమేహంగా మారునని చెప్పబడింది. మధుమేహ మొక అసాధ్యవ్యాధి (కొన్నిచోట్ల మధుమూత్రం కూడ ప్రమేహాలలో ఒకటని తెల్పబడింది.) సామాన్యంగా ప్రమేహ వ్యాధులు 60 సం॥ లకు పైబడినవారికే వచ్చేవి. కాని నేడు వయస్సుతో నిమిత్తం లేకుండా వచ్చేస్తుంది. ముఖ్యంగా మేహములు శరీరపరిశ్రమ చేయకుండా తిని కూర్చొనే భోగులకు, సోమరులై అమితంగా నిద్రించేవారికి, పెరుగును అధికంగా వాడే వారికి, విశేదగుణములు కలిగిన నిషిద్ధాహారాలను ఒకే పర్యాయం భజించువారికి సంప్రాప్తించును. ఉదా: పాలు, బెల్లం, చేపలు భుజించిన వెంటనే పాలు త్రాగడం, ఇలా చేయడంవల్ల శరీరతత్వం మారుతుంది. అట్టి మాలిన్యాలను తొలగించుటకు తేనే చాలామంచిది. ఔషధంగా పని చేస్తుంది. గాబట్టి అతిమూత్ర వ్యాధిని నిర్మూలించటానికి తేనె ఉపయోగపడుతుంది. అతిమూత్ర రోగులు, (వ్యాధివచ్చిన కొత్తలోనే) తాజా నిమ్మరసం, తేనె, నీళ్ళతో కలిపి ఉదయం (పరగడుపున), రాత్రి పరుండబోవునపుడూ వాడితే చాలా మేలు చేస్తుంది. అతిమూత్ర రోగులు కాఫీ, టీ, పంచదార విసర్జించాలి. గోధుమ ఎక్కువ వాడితే చాలా మేలు. లేకపోతే క్రమేపీ మధుమూత్రములోకి దింపుతుంది. తేనె మూత్రపిండములను, మూత్రకోశాన్ని శుద్ధి పరిచి, బలముచేస్తుంది. ఇది మరువ వద్దు.

### మకరందము

#### పక్షవాతము

పక్షవాతము మరియొక భయంకర రోగము. తరుణంలో జాగ్రత్తపడి తగిన చికిత్స చేయకపోతే జీవితమంతా శరీర అవయవాలు (పక్షవాతం వచ్చినవి) అవిటిగా ఉండిపోతాయి.

వాతశ్లేష్మముల ప్రకోపంవల్ల పక్షవాతం వస్తుంది. తేనె, వాతశ్లేష్మహరము. ముఖ్యంగా వాతహరం కొబట్టి పక్షవాత రోగులకిది మందు! ఆహారము!! పక్షవాతం వున్నవారికి ఎంత తేనె వాడితే అంత మంచిది. ఇక్కడ, యేమందు లేకయే కేవలం తేనెతోమాత్రమే, అమృతహస్తులని పేరుబడ్డ మా మామయ్యగారి (మేనమామగారు కూడ) చే, సంపూర్ణంగా నివారణ చేయబడిన పక్షవాతం కేసు నొకటి వివరిస్తే నమ్మకం కలవచ్చు.

సరిగ్గా పదినెలల క్రిందటిమాట. ఒక రోజున ఉదయాన్నే 18 సంవత్సరాల పిల్లవాడు ఏడుస్తూ యింట్లోకి పరిగెట్టుకొచ్చి,

వంగాని ప్రభావతి భానుమతి

### ఇది మీకు తెలుసా!

మునక్కాయల్లో కన్నా, మునగ పూవుల్లోనే ఎక్కువ బలాన్నిచ్చే పదార్థాలున్నాయి - కాయలకన్న మునగపూలే ఎక్కువ రుచికరంగా వుంటాయి—

బొప్పాయి పండులోని గింజల్ని ఎండబెట్టి పొడిచేసి పాయసంగా తయారు చేస్తారు.—

ఆరు నారింజ కాయల్లోవుండే 'సి' విటమిను ఒక్క వుసిరి పండుల్లో ఇమిడి వుంది!—

గులాబీపూలరేకుల్ని రాత్రంతా తేనెలో నానేసి ఉదయాన్నే తింటూంటే ముఖానికి చక్కటి తేజస్సు వస్తుంది—చేతివ్రేళ్ళ గోళ్ళు సహజమయిన గులాబీ వర్ణంతో మిలమిల మెరసిపోతాయి—

బాగా ముదిరిన గోంగూర కాయలతో రుచికరమైన జామ్ తయారు చేస్తారు—

బి. ప్రేమలీల.

మామగారిపేరుతో గట్టిగా పిలుస్తున్నాడు. ఆయన అప్పుడు స్నానంచేయబోతున్నారు. ఆ పిల్లవాని గాభరా చూచి వారు దగ్గరకెళ్ళిగా, వాడు ఏడుస్తూ, "ఇప్పుడే మా నాన్నగారు మంచం మీది నుండి లేచి రెండడుగులు వేసి క్రిందపడిపోయారు, నోటివెంట మాటరావడంలేదు. కదలటంలేద"ని చెప్పి మళ్ళీ గొల్లున యేడ్వసాగేడు.

ఆయన వెంటనే రోగియింటికి (మాయింటికి కొన్ని గజాల్లోనే ఉంది) వెళ్ళిచూచి వచ్చారు.

రోగి వివరాలు: వయస్సు 45 సం॥లు 30 సం॥ల నుండి ఉబ్బసంతో బాధపడుచున్నారట. కొద్దినెలల క్రితంనుండి ఊపిరిసలుపనివ్వనంత ఉధృతంగా ఉంది ఉబ్బసం. దాంతో కొన్నినెలలనుండి నిద్రలేదు. ఈ పరిస్థితుల్లో, తొందరపడి శక్తివంతమైన మందులు వాడితే యేమి ప్రమాదం వస్తుందోనని మా యింట్లో పాత తేనె యేమైనా వుందేమో చూడమన్నారు. సాధారణంగా తేనె మాయింట్లో నిల్వ చేయటానికి వీలుండదు. ఏమందో తయారు చేయడానికి వినియోగించేస్తారు. ఉండదని తెలిసివున్నా, ఆయనకి లేదని చెప్పటానికి యింట్లో యెవ్వరికీ ధైర్యం లేక, అన్నీ గాలించగా ఒక కుండలో సుమారు 2 పౌన్ల తేనె దొరికింది. దానిమీద అంటించిన లేబుల్ నిబట్టి 14 మాసాలు నాటి తేనెగా తెల్సుకొన్నాం. అది వేరేపాత్రలో పోసి వారే తీసుకువెళ్ళి ½ పౌను వరకూ తాగించి తతిమ్మాది వాళ్ళయింట్లోవాళ్ళకిచ్చి ప్రతిఘంటకు రెండేసి ఔన్సులు చొ॥న పట్టించమని చెప్పివచ్చేశారు.

అప్పటి పరిస్థితి: రోగి చాలా నీరసస్థితిలో నున్నాడు. మూతివంకరపోయింది. ఎడమ చెయ్యి, ఎడమకాలు చైతన్యం లేకుండా పడిపోయాయి. పెదిమలు మెదపుతేగాని మాటలేదు. సౌజ్ఞచేయటానికికూడ కుడి చేయిరాలేని నీరసస్థితిలోనుండి, బేజారి చూపులతో నున్నారట.

మళ్ళా మధ్యాహ్నం చూచివచ్చేరు. మొటమొదట తేనెయిచ్చిన 5 నిముషాలకే గాఢనిద్రపట్టిందట. 4 గంటలు చక్కగా నిద్రపోయింతర్వాత లేచేసరికి శరీరానికి సత్తువ, పక్షవాతం జెందిన అవయవాలకు 10 వంతు శక్తికలిగి కదపగలారు. అప్పుడు వేడినీళ్ళలో గుడ్డతడిపి శరీరమంతా తుడిపించి, పొడిగుడ్డతో వెంటనే తుడిచివేసి మళ్లా ½ పౌను తేనెపట్టించి పక్షవాతం జెందిన అవయవాలకి అర్కక్షీరతైలం మర్దనచేయించి వేడినీళ్ళకాపడం పెట్టించేరు. సాయంకాలానికి వూహించజాలనంతటి అత్యద్భుత ఆశ్చర్యకర నివారణకనబడింది. రోగి ఒకరి ఆసరాతో గదిలో తిరగగలిగాడు! ఆనాడు ఆహారంగా తేనెవుపయోగించారు. మర్నాడు పల్చటిగోధుమజావ, మధ్యాహ్నం ఆహారంగా యివ్వబడింది. ఇలా 15 దినములు తేనెను, గోధుమరొట్టెవాడగా ఆయన సంపూర్ణారోగ్యం పొందాడు. మేకపాలు యిచ్చినా మేలుంది కాని స్వచ్ఛమైన మేకపాలుదొరక్క యీయనకివ్వలేదు.

కాబట్టి శిశువులకువచ్చు పక్షవాతం నివారించాలంటే ప్రతిబిడ్డకు తగినంత తేనె వాడాలి.

పక్షవాతపు రోగులకు ముషిణిచెట్టు పుష్పించినకాలంలో సేకరించిన తేనె వాడితే చాలాగుణమయిస్తుంది.

### కంటివ్యాధులకు :

స్వచ్ఛమైన తేనెచుక్కలను కండ్లలో వేస్తే కొద్దిగామండి, కంటియందలి దుష్టమునుతొలగించి మంచిదృష్టికలించును మధ్యకాలంలోవచ్చిన అంధత్వమునకు కాశ్మీరు నుంచివచ్చే పరిశుద్ధమైన తేనెనుపయోగిస్తే దృష్టివస్తుందట.

### స్థూలకాయులకు, బక్కచిక్కినవారికి

స్థూలశరీరంగలవారు భోజనానికిముందు తేనెసేవిస్తే స్థూలత్వం తగ్గుతుంది. బక్కచిక్కినవారు భోజనంతరువాత తేనెవాడితే శరీరముపుష్టవగును.

### ముఖ్యగమనిక :

తేనెను అన్ని పండ్లరసాల్లోనూ కలిపి వాడవచ్చు. శీతలజలంలోను, గోరువెచ్చని నీటిలో కూడకలిపి వాడవచ్చును. జ్వరంవున్నవారికి వాడరు. (కాని సన్నిపాతజ్వరంలోకూడ గోరువెచ్చని పండ్లరసంలోకలిపి పాశ్చాత్యులువాడుతారట.) మనవైద్యులు జ్వరానంతరం తేనె అనుపానంగాను, ఆహారంగా వాడతారు.

తేనె వేడిగానున్నది గాని, పచ్చిది (కాయనిది) గాని, వేడివేడిపదార్థాల్లోకలిపి గాని(గోరువెచ్చని పదార్థాల్లో కలుపవచ్చు) వాడరాదు.

సమభాగములుగాకలుపబడ్డ తేనె, నెయ్యి విషతుల్యము.

నిల్వగావుంచినకల్తీతేనె వాడరాదు. ★

(అయిపోయింది)

## దీర్ఘ అజీర్ణరోగమునకు

'సునాముఖీ' ఆకు (10 తులాలు) దోరగా నేతిలోగాని ఆముదములోగాని వేయించి తరువాత పటికబెల్లము (5 తులాలు) తో మెత్తగా పొడుముగా నూరి 5 అవున్సుల మంచిపుట్టతేనెలో వేసి ఒక పెద్ద సీసాలో వుంచుకొని రాత్రులు పరుండబోయేటప్పుడు గచ్చకాయంత వుండ చేసుకొని తినవలెను. ఇలా తినుటవలన దీర్ఘ అజీర్ణవ్యాధి క్రమేణా తగ్గి తిన్న పదార్థము జీర్ణమై క్రమేణా జీర్ణశక్తి వృద్ధియగును. మలబద్ధకము, పోగొడుతుంది. ఆకలి గలిగించి, జఠరాగ్ని వృద్ధిచేయును.

ఒక మాసము ఈ 'సునాముఖీ' లేహ్యము తీసుకున్న దీర్ఘ అజీర్ణవ్యాధులు నివారించును.

సునాముఖీ ఆకు మనము నిత్యము పెట్టుకొనే చారులో ఒక తులము ఆకు వేసుకొని సలసలా కాగాక చారుదింపేశాక కొంత బెల్లము అందు వేయవలెను. అన్నములో పోసుకొని తినుటకు, రుచిగా ఉండును. అజీర్ణము పోగొట్టును. నిద్ర బాగా పట్టును.

## పైత్యము

ఒక తులము సునాముఖీ ఆకు కొంత చింతపండు కొంత బెల్లము, పోపు పెట్టిన మినపప్పు, ఆవాలు, కొంత ఇంగువ వేసి నూరి పచ్చడిలా చేసుకొని ప్రథమమున అన్నములో నెయ్యి వేసి కలుపుకుతిన్న ఎడల పైత్యము, అజీర్తి నివారించి భుజించిన ఆహారము సులభముగా జీర్ణమగును.

రెండు నిమ్మకాయలరసము ఒక కప్పులోనో లేక ఒక సీసాలోనో పోసి కొంత సైంధవలవణము వేసి అరతులము అల్లము, తొక్కతీసి చిన్నముక్కలుగా తరిగి అందువేసి కొంత జీలకర్ర కూడా వేసి ఒకరోజు వుంచవలెను. నిత్యము ఉదయం ఒక చెంచాడురసము 3 4 అల్లంముక్కలు తిన్నచో పైత్యం, వికారం, నోటిదుర్గంధము పోగొట్టి నిక్కాక అణచివేసి ఆకలి కలిగించును. ఆరోగ్యము బాగుండును.

ఇవటూరి శ్యామలదేవి, తెనాలి.






చిట్టి పాప

[ఫోటో: ఎరిబోయిన సూర్యప్రకాశరావు, —మద్రాసు]

## బ్రహ్మతరం కాదు

వడలి నిర్మల ప్రభావతిగారు జూలై 31 తేదీ వారపత్రికలో వ్రాసిన "పాము వాలికలు" అనే వ్యాసం మూడుసార్లు చదివాను. వారితో నేను ఏకీభవిస్తున్నాను. వారికి నా ధన్యవాదాలు.

పాము వాలికలు కలవారు ఆడవారిలోనే కాక మగవారిలో కూడా కలరనడంలో పొరపాటేమీ లేదు. అటువంటివారికి మతి స్థిమితం వుండదేమోనన్నారు. మతి స్థిమితం లేకపోవడం కాదు, కేవలం ఒకరిని మోసగించి జీవించే పలుగాకు లంటాను. ఎలుక మీద పిల్లిని, పిల్లిమీద ఎలుకను ఎక్కించే వారు, స్వలాభపరులు. వారు ఎటువంటి నీచ ప్రవర్తనకైనను దారితీస్తారు. ఇదంతా బాలికలలో లేదని నేనంటాను. స్వతహా వారికి జన్మహక్కుగా సంక్రమించిందంటే మంచిది.

వున్నమాటంటే వులుకెక్కువ. ఇటువంటి వారందరూ సమాజానికి చీడపురుగుల వంటివారు. పాముపాలికలు కలవారిలో విలువుండదని మన మనకోరాదు. వారికే నేటి లోకంలో విలువెక్కువగా వుంది. ఇటువంటివారు పట్టణాలలో కంటె పల్లెలలోనే ఎక్కువగా కనబడుతున్నారు. అటువంటివారికి సూటిత్రోవ చూపుటకంటే, దుష్టుల్ని దూరంగా వుంచడం మంచిది. వారి మనస్సుల్ని మార్చడం మనల్ని పుట్టించిన బ్రహ్మకే తరంగాదు.

జి. యస్. గోపాలకృష్ణ,
కోరుకొల్లు.

* * *

## టీకాలు

"పసిపిల్లలు, టీకాలు" ఎం. జి. కాంతమ్మగారు వ్రాసిన వ్యాసం చదివేను. ఆమె వ్రాసినటుగా చేసినకూడా మంచిదే. కాని వారు తోచినది, నేను చేసినదికూడా వ్రాస్తున్నాను. టీకాలు పిల్లలకు చాలా ముఖ్యము. పిల్లలు బాధపడిపోతారని, టీకాలు వేయించడానికి పెద్దవాళ్లు జడుస్తారు. అదేమి అక్కరలేకుండా, టీకాలు పొక్కుతున్న సమయంలో, పొలాల గట్లమీద మెత్తటి మన్ను, (అనగా) రేగటిమన్ను నీళ్లతో కలిపి, బిడ్డ బెదురులేకుండా మెత్తగా చూచుకొని, ఆ టీకాలమీద బిళ్ళలు మాదిరి పెట్టి, పైన వక తెల్లటి గుడ్డకట్టి, అప్పుడప్పుడు బిగపట్టకుండా తడుపుతూవుంటే, ఏ మందు వెయ్యక్కరలేకుండా 4, 5 రోజులలో చిప్పలు మాదిరిగా వచ్చేస్తాయి. ఏ మాత్రం పచ్చివున్నా, పిల్లలు వుపయోగించే పవుడరు అద్దితే పూర్తిగా తగ్గిపోతాయి. మా పాపలకు అదేవిధంగా చేసేము. ఏమీ బాధ పడలేదు.

కె. సత్యవతమ్మ (పిఠాపురం).

* * *

24-1-57 వనితాలోకంలో భాగవతుల రాజేశ్వరిగారు వ్రాసిన "అధిక ప్రసంగం" చదివేను. ఆ వ్యాసంలోనున్న ప్రతివాక్యం నిజం. నేను ప్రతిరోజు చూస్తూనేవున్నాను మగవాళ్ళు వీధిలోకివెళ్ళి అటని పోళ్ళు తిన్నది జీర్ణించుకొంటే, ఆడవాళ్లు అధిక ప్రసంగంచేతే జీర్ణించుకొంటారు. అసలు మాట్లాడుతూంటే ఆకలే వెయ్యదు. ఇటువంటి వ్యాసాలు వ్రాస్తుంటేగాని ఆడవాళ్లు బాగుపడరు.

ఎన్. లక్ష్మి బి. ఏ. (మద్రాసు.)

* * *

7-8-57 ఆంధ్ర వారపత్రికలో "వనితాలోకం"లో శ్రీమతి సోమంచి అనంతలక్ష్మి ప్రభాకరంగారి "పాతబట్టలు" వ్యాసం చాలా బాగుంది. నిజముగా ఇంటివద్దవున్న వనితలు కూరగాయ మొక్కలు, పూల మొక్కలు పెంచుట, కొన్ని చేతిపనులు చేయుట చాలమంచిది.

బూర అచ్యుతాంబ (సాలూరు.)

ఊహ మంచిదే అంటూ ఒకసోదరుడు (సికింద్రాబాదు) వ్రాసినదానితో నేను పూర్తిగా ఏకీభవిస్తాను. అంతేగానీ "నేను పెళ్లి చేసుకోను. బ్రహ్మచారిణిగా ఉండి ఉద్యోగం చేస్తాను" అని అనుకోవడంలో అర్థంలేదు. ఇటు వివాహంకాక, అటు ఉద్యోగంలేక నానాబాధ పడతారు. సరోజిని గారు వ్రాసినదానితో పూర్తిగా ఏకీభవించలేనప్పటికీ కూడువంతులు ఆమె వ్రాసినది రైటే. అట్లా ఉద్యోగం చేసే స్త్రీని చూసి పురుషులేకాదు, స్త్రీలే ముందు బుద్ధితెచ్చుకుని ఒకరిజోలికి వెళ్ళకుండా, ఆమెను ఏమీ అనకుండావుంటే అదేచాలు. ఇప్పుడు మనకి పురుషులకంటే స్త్రీలబాధే ఎక్కువగా వుంది. స్త్రీని గౌరవించడం పురుషులకంటే స్త్రీలు ఎంత త్వరగా నేర్చుకుంటే మనబాధలు అంత త్వరగా పోతాయి.

బలభద్రుని వరలక్ష్మి,
(విజయనగరం.)

* * *

గమనిక

గతవారం వనితాలోకం 37-వ పేజీలో డోర్ కర్టెన్ మీదకు డిజైన్ వేసినవారు: డి. రాజేశ్వరి (టెక్కలి).



# భార్యలు - భర్తలు



(35-వ పేజీ తరువాయి)

చెప్పేసి, "ఈ చాలీచాలని జీతంతో సంసారం చేయటం నావల్లకాదమ్మా", అంటూ తన పుట్టింటి గొప్పలు చెప్పి భర్తను ఎద్దేవా చేసే వనితలను మనమందరం ఎరుగుదుము.

ఈ సందర్భంలో నాకో చిన్న జోక్ జ్ఞాపకం వస్తోంది. ఒకటో తేదీనకూడా ఖాళీ జేబుతో తిరిగే ఒక వ్యక్తిని స్నేహితుడు పలకరించి. "నీ స్వంతఖర్చులకి కొంతడబ్బు వుంచుకుని మిగిలిన జీతమే ఇంట్లో యీయరాదా?" అని అడుగాడట. అలాచేసేందుకు ఒక 'లా' (Law) అడ్డం వస్తుందన్నాడుట. ఆయన అది ఏ 'లా' నో తెలియక అవస్థపడే మిత్రునికి, 'మదర్-యిన్-లా (అత్తగారు) అని విపులీకరించాడు మొదటివ్యక్తి. ఇటువంటి పరిస్థితులు సంసారాలలో కలుగకుండా నివారించటం ఎంతైనా అవసరం.

ఇంకా కొంతమంది యింట్లో కాలు బయటపెట్టకుండా యిది తెండి అది తెండి అని పురమాయిస్తారు భర్తలకి. ఎలాగో కష్టపడి అతను తెస్తే అవి బాగాలేవు తిరిగి యిచ్చేయమనీ, ఇన్నేళ్ళొచ్చినా యింత మాత్రం తెలియదా అనీ సాధిస్తారు ఇంతకంటె కావలసిన ఆ వస్తువేదో తామే తెచ్చుకుంటే యే యిబ్బందీ వుండదు. ఉదయం 9 గంటలకి ఆఫీసుకి వెళ్ళేలోపల ఇంటిపనులు అన్నీ చేసి అదరాబాదరా భోజనంచేసి ఆఫీసుకి పరుగెత్తాలి. తిరిగి 5 గంటలకి యింటికి రాగానే బజారుకి వెళ్ళాలంటే మగవాళ్ళకి మాత్రం కష్టంగా వుండదూ? ఆ స్థితిలో వాళ్ళని పనిచెయ్యమంటే ఆ పనిమీద దృష్టి లేక, కాదని చెప్పలేక యేదో మొక్కుతీర్చుకునేందుకు చేస్తారు.

## ఉభయతారకం

సాధారణంగా ఆఫీసులకి వెళ్ళే మగవాళ్ళుంటే యిళ్ళలో 9 లేక 9-30 కి వంట అయిపోతుంది. అయిపోవాలి. 11 గంటలు అయ్యేప్పటికి అందరి భోజనాలు అవుతాయి. ప్రతిరోజూ సాయంత్రం టిఫిన్ చేయాలన్నా 3 గంటలనుంచీ సాయంత్రపు పని మొదలు పెడితే చాలు. మధ్యాహ్నంవేళ ఒక గంట విశ్రాంతి అవసరమే. బజారునుంచి ఏవైనా వస్తువులు కావాలనుకుంటే 11-12 గంటల మధ్య స్త్రీలే తెచ్చుకోవచ్చు. ఆ టైములో షాపుల్లోకూడా రద్దీ తక్కువగా వుంటుంది. ఉదయం, సాయంత్రం అయితే గంట పట్టే పని, ఈ వేళలో పావుగంటలోనే అవుతుంది. తరువాత 3 గంటలవరకూ విశ్రాంతి తీసుకోవచ్చు. అంత ఎండలో భోజనం చేయగానే బయలుదేరటం కష్టం అనుకుంటే రెండూ మూడు గంటలమధ్య వెళ్ళవచ్చు. అలా అయితే మనకు నచ్చిన సరుకు తెచ్చుకోవచ్చు. వాపసుచేసే బాధ తప్పుతుంది.

ముఖ్యంగా కూరల విషయంలో నాణ్యం తెలిసిన మగవారు తక్కువ. మార్కెట్లో యేవి యిస్తే అవి వారు తేవటం, అందులో సగం పుచ్చులు దచ్చులు పోవటం మన కందరికీ తెలిసిన విషయమే. డబ్బుకి డబ్బూ దండగ, అవసరానికి పదార్థాలూ ఉండవు. శని, ఆదివారాలు ఆఫీసు హడావడిఉండదు. వంటకీ తొందరఉండదు కాబట్టి ఆరోజుల్లో ఒంటరిగా కాని ఇరుగు పొరుగు స్త్రీలతో కాని, పని మనిషితో కాని మార్కెట్ కి వెళ్ళి సుమారుగా వారం రోజులకి సరిపడే కూరలు తెచ్చుకుంటే మంచిది. నిల్వవుంటే చెడిపోయే కాయగూరలు ముందు వాడుకుంటే దుంపకూరలు, నిలవవుండేవి వారం చివర భాగంలో వాడుకోవచ్చు. అంతగా తక్కువ అయితే ఏవో యింటి దగ్గర అమ్మకానికి వచ్చిన కూరలు కొనుక్కోవచ్చు. పల్లెల్లో అయినా, పట్నవాసాల్లో అయినా కూరగాయలు ఇంటి దగ్గరకు వస్తాయి.

"ఇంత బ్రతుకు బ్రతికి యింటి వెనక చచ్చె" నన్నట్లు నేను మార్కెట్నుంచి కూరగాయలసంచీ మోసుకురానా అని కొందరికి కష్టంగా వుండవచ్చు. అందులో తప్పుకానీ అవమానంకానీ ఏమీ లేదు. సాధారణంగా స్త్రీలలో ముప్పాతిక మందికి (ఉద్యోగం చేసే వారిని మినహాయిస్తే) "ఫలానావారి భార్య"గానే తప్ప స్వంత హోదా ఏమీ వుండదు. అలాంటప్పుడు "ఫలానావారి భార్య"కే-యిలాంటి పనులు (సంచులు మోవటం వగైరా) నామోషీ అయితే ఆ "ఫలానావారికి" ఎంతనామర్దా!! అందుకని నౌకర్ల చేత తెప్పించుకుంటామనవచ్చు. కాని నౌకర్లని పెట్టుకునే శక్తి అన్ని సంసారాల్లో వుంటుందా? వాళ్ళైనా మంచి సరుకు తెస్తారని గ్యారంటీ ఏది?

కొందరు రైలు ప్రయాణాల్లో సహా చెంబెడు మంచినీళ్ళయినా తీసుకురారు. చంటిపిల్లో, పిల్లవాడో వుంటే ఆయన ఎత్తుకోవలసిందే. అవసరానికి చిన్న చేతిసంచీ అయినా పట్టుకోరు. ఒకవేళ యే స్త్రీయైనా ఇందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తే, ఆమెను చూసి నవ్వటం, ఆమెభర్తను నాగరికత తెలియని మూర్ఖుడని హేళనచేయటం జరుగుతుంది. ఇది చాలా పొరపాటు. "గృహిణి అంటే సమానభాగస్వామిని" అని చెప్పుకోగోరే స్త్రీ అతని సుఖాలనేకాక కష్టాలను కూడా సమానంగా పంచుకోవాలి. భర్తకు 1000 రూపాయలు జీతమైతే అతనితోపాటు కారులో తిరగగలిగినప్పుడు, అతడు సూట్ కేస్ తెస్తే తను కనీసం చేతిసంచీ అయినా మోయగలగాలి.

అలా చేయలేనిపక్షంలో స్త్రీలు వాంఛించేది సమానత్వంకాక ఆధిక్యత అవుతుంది. అంటే మళ్ళీ పాత పరిస్థితే. అయితే చోట్లు మారాయన్నమాట. దానివల్ల తృప్తి ఎంత మాత్రం సాధించలేము. ప్రతి విషయంలో భర్త తనను సంప్రతించాలి అనుకునేభార్య, ప్రతి చిన్నపనికీ అతనిమీద ఆధారపడక, తను కూడా కొన్ని పనులుచేసి అతని శ్రమ తగ్గించాలని గ్రహించాలి.

ఎవరిపనులు వారు చేసుకోవటంలో అవమానమేమీ లేదు. అందరూ కాయకష్టం గౌరవాన్ని గుర్తిస్తే, ఏసమస్యా వుండదు.

చీరెలు నగలు కొనుక్కునేందుకు షాపుకు వెళ్ళే లేనిఅవమానం వచ్చాలఅంగడికీ, కూరల మార్కెట్ కీ వెళ్ళేందుకు ఎందుకుండాలి?" "మాకు నౌకర్లున్నారు. పని చేస్తూ వాళ్ళు నాలుగురూపాయలు తిన్నా మాకు కొరత లేద"నుకునే వారిమాట మనకప్రస్తుతం. ఆ సౌకర్యం లేనివాళ్ళని గురించే ఆలోచన.

మావారి జీతం చాలటం లేదు. నేనుకూడా ఎలా సంపాదించగలను? అనుకునే వారు నౌకర్లమీద ఎక్కువగా ఆధారపడకుండా స్వయంగా పనులు చేసుకోవటంవలన కొంత డబ్బు కలిసొస్తుంది. అంతేకాక అస్తమానం నాలుగుగోడలమధ్య ఇరకాటంలో వుండే వారికి పరిశుభ్రమైనగాలి పీల్చుకునేందుకు ఒక అవకాశం. శరీరానికి వ్యాయామం. ఇంకా యిలాటి లాభాలెన్నో చేసి చూచే వాళ్ళకి తెలుస్తాయి. భర్త శ్రమను కొంతవరకైనా తగ్గించకలిగానన్న భావం ఎంతో తృప్తినిస్తుంది.



# బాల సాహితి

##  చెల్లి మల్లి!

లే లెమ్మ చెల్లీ!
రారమ్మ మల్లీ!
మల్లెపూ పొదలన్ని
కొల్లలుగ పూశాయి
చూసివచ్చానమ్మ
కోసి కొందము రమ్మ.

మనమల్లిపూలచే
ఘనమైన వాసనలు
గాలిలో వ్యాపించి
తేలిపోతున్నాయి!

నవ్వుచున్నట్టున్న
పువ్వు లన్నిటివలన
మల్లిపొద లన్నిటికి
తల్లికళ వొచ్చింది.

మాపటికి రేపటికి
మరికొన్ని చినిచిన్ని
వెండిమొగ్గలు కనుల
పండుగై వెలుగునే!

పాడుకుంటూ ఆట
లాడుకుంటూ పూలు
కోసికొనివంతులే
వేసికొందాములే!

నీవంతులో సగము
నావంతులో సగము
అమ్మకిద్దాము లే!
ఆడుకుందాము లే!
రారమ్మ చెల్లీ!
లే లెమ్మ తల్లీ!

నాగపట్ల వెంకటప్పారావు.

# 'బాకీ తీరింది!'

కొత్త పట్నంలో గోవిందశెట్టి అనే కోమటి ఉన్నాడు.

ఆతడు ఒకనాడు జ్యోతిష్కుణ్ణి పిలిచి, 'అయ్యా, ఈ సంవత్సరం నేను ఏ పని తలపెట్టినా భగ్నం పాడైపోతోంది. ఎందువల్ల?' అని అడిగేడు.

'నీకు ఏలినాటిశని పీడిస్తున్నాడు. మందపల్లి వెళ్లి అక్కడ శనైశ్వరుడుకి కుంచెడు నూనె అభిషేకం చేయించు. దానితో పీడ వదిలిపోతుంది' అని సలహా చెప్పేడు జ్యోతిష్కుడు.

'కుంచెడు నూనె అంటే ఇంటిల్లిపాదికీ ఏడాదికి సరిపడే ఆవకాయకు సరిపోతుంది! అంత నూనె తీసుకుపోయి, అభిషేకమంటూ శనైశ్చరుని నెత్తిమీద పోసెయ్యడమేనా?' అని పించింది షావుకారుకి. ఆ అభిషేకాన్ని వాయిదా వేసుకుంటూ వచ్చాడు.

ఆ దరిమిలానే ఊరగాయల రోజులొచ్చాయి. శెట్టి భార్య ధనలక్ష్మి 'నూనె కొని తీసుకురండి' అని, జాడీని ముందు పెట్టింది.

షావుకారు ఆ జాడీ మోయించుకుపోవడంకోసం వీధిలో నిలబడి కూలివానికోసం వరకాయించాడు.

ఒక మనిషి కనపడి రాకపోకల కూలి అర్ధ రూపాయి అడిగాడు. శెట్టి అరణాలకు బేరమాడపోయాడు. ఆ మనిషి, 'ఒక్క దమ్మిడి తక్కువైనా రాను.' అని నిక్కచ్చిగా చెప్పి చక్కాపోయాడు.

వాడి వెనకాలే మరొకడు వచ్చాడు. వాడు మాంచి జబ్బపుష్టి ఉన్నవాడే గాని, మొహం తీరుచూస్తేమటుక్కి శుద్ధ వెర్రిబాగులవాడిలాగ కనపడ్డాడు. వాణ్ణి చూడటంతోనే శెట్టి సంగతంతా చెప్పి, 'అరణాలకు వస్తావా?' అని అడిగేడు. వాడు సరిగా వినిపించుకోక, 'నాలుగణాలా బాబూ? వస్తాను' అన్నాడు.

శెట్టి, 'ఔను. నాలుగులణాలే! రా.' అని తనలో, 'వీడు చెవిటివాడు గనక సరిపోయిందిగాని, నాలగణాలకు బదులు, అరణాలు ఇచ్చుకోవలసి వచ్చును! నా తెలివి తెల్లవారిపోనూ! ఏకంగా అరణా లన్నానేమిటి?' అనుకుంటూ జాడీని వాడి నెత్తిమీదపెట్టి, బజారుకు తీసుకుపోయాడు.

ఆ కూలివాడికి చెముడూ లేదు గిముడూ లేదు! వాడు అసలు కూలివాడేగాదు! ఎవరుమరి? ఎవరికైతే కుంచెడు నూనె అభిషేకం చేయించవలసిందని జ్యోతిష్కుడు గోవిందశెట్టికి సలహా ఇచ్చాడో ఆశనైశ్చరుడు! ఆయనే శెట్టి కెలాగైనా బుద్ధి చెప్పాలని ఆ వెంగళప్ప వేషంలో చక్కా వచ్చి నాలుగణాలకూలికే సిద్ధమై జాడీని నెత్తిన పెట్టుకున్నాడు.

కొట్టువద్ద కుంచెడు నూనె జాడీలో పోయించుకున్నాడు శెట్టి. కూలివానికి మళ్లే వచ్చిన శనీశ్వరుడు జాడీని నెత్తిన పెట్టుకుని శెట్టి వెనకనే నడుస్తున్నాడు. ఆయన ప్రభావంవల్లనే శెట్టికి నోరుపెగిలి ఊసుపోక ఒక ప్రశ్న వేశాడు. 'ఏమిరా అబ్బీ, నువ్వీరోజున సంపాదిస్తూన్న కూలి, ఒకటీ రెండూగాదు, నాలుగణాలు కదా. ఈ సొమ్మంతా ఏమి చేస్తావు?'

'దీనితో ఒక కోడిపెట్టను కొంటానండి.'

'కొని?'

'కోడిపెట్ట గుడ్లు పెట్టదండీ మరి? ఒక్కొక్క గుడ్డే పొదిగి పిల్లని జేస్తుంది.'

'చేస్తే?'

'ఆ పిల్లలన్నీ పెద్దవై గుడ్లు పెడతాయి. అవన్నీ పిల్లలై తరవాత పెద్దవై గుడ్లు పెడతాయండి.'

'సరే, బోలెడు కోడిపెట్టలూ, పుంజులూ పోగవుతాయి నీకు.'

'వాటిని అమ్మేసి ఒక మేకని కొంటాను. అది పిల్లల్ని పెట్టి, ఆ పిల్లలు పెద్దవై క్రమంగా కొద్దిరోజుల్లోనే—'

'ఒక పెద్ద మేకలమంద తయా

రవుతుంది. అప్పుడేం చేస్తావు?'

'వాటి నమ్మేసి ఆవుల్ని కొని—'

'ఒక పశువులమంద సంపాదిస్తావు. దానితో ఏం చేస్తావు?'

'అరబ్బీగుఱ్ఱాలు కొంటాను. ఎవరో అరబ్బీవాడు ఒక రాజుగారికి తన గుఱ్ఱాన్ని లక్ష రూపాయలకి అమ్మేడుట. నా గుఱ్ఱాలు కూడా ఒక్కొక్కటే లక్ష రూపాయలకు అమ్ముడైపోయి—'

'నువ్వు కోటీశ్వరుడివి ఐ ఊరుకుంటావు! అప్పుడు?'

'అప్పుడు ఇంక వ్యాపారం మానేసి ఒక మంచిపిల్లని పెళ్ళి చేసుకుంటాను!'

'పెళ్ళి చేసుకుంటే పిల్లలు పుడతారు. తర్వాత?'

'పుట్టి ఊరుకుంటారండీ! ఒకటే అల్లరి మొదలెడతారు. కాని నేను మాత్రం వాళ్ళని గారం చెయ్యను!'

'ఏం చేస్తావు మరి?' అని సెట్టి శనైశ్చరునికేసి చూశాడు.

'అల్లరిచేస్తోన్న పిల్లవాడి చెవిని ఇలాగ దొరకపుచ్చుకుని మెలిపెట్టి, రెండో చేతితో ఇలాగ చెంప పగిలేటట్టు ఒక్క దెబ్బ కాయకొడతాను!' అంటూ శనైశ్చరుడు జాడీని వదిలి చేతులతో అభినయిస్తూ తల ఎగరేశాడు. జాడీ కిందపడిపోయి ముక్కముక్కలై నూనె అంతా నేలపాలై పోయింది.

సెట్టికి దానితో వళ్ళు మండి, 'ఓరి వెధవా, కుంచెడు నూనె భగ్గం పాడుచేశావు!' అంటూ కొట్టబోయాడు.

కూలివాని రూపంలో ఉన్న శనిదేవుడు తొణుకూ బెణుకూ లేకుండా నిలపడి, 'ఏమిటయ్యా, కాస్త నూనె పోతే ఇంత గల్లంతు చేస్తున్నావు? నా కోడీ, గుడ్లూ, పశువులూ, గుఱ్ఱాలూ, నా భార్యా, పిల్లలూ, నా సమస్తైశ్వర్యం పోయిందని నే నేడుస్తోంటే, నీకు కొంచెం కూడా సానుభూతి లేదే!' అంటూ అదృశ్యుడయాడు. ★

# దానవీర కర్ణుడు

(12-వ పేజీ తరువాయి)

"నాకు మీ ఆశీర్వాదం చాలు. ఇంకేమీ అక్కరలేదు. పెద్దల ఆశీస్సులే చిన్నల్ని వెంటాడి రక్షిస్తాయి."

"కాదు కాదు. ఇది కాకుండా ఇంకా ఏమయినా కోరుకో."

"మీదగ్గర నుంచి కోరుకునేందుకు నాకు మనస్సు ఒప్పటంలేదు తండ్రీ! పెద్దల ఆస్తి చిన్నలకి రాక ఏమవుతుంది?"

"కానీ, నన్నేమీ కోరుకోకపోతే నేను ఇక్కడినుంచి వెళ్ళలేను. ఇక్కడ నన్నెవరు ఆపుతున్నారో నాకే తెలియకుండా వుంది. నేనిక్కడి నుంచి ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేకుండావున్నాను. మనస్సులో ఏదో పరిపరి విధాలయిన ఆలోచనలు పీకుతున్నాయి. నువ్వు ఏదయినాసరే కోరుకో" అన్నాడు విచారంగా ఇంద్రుడు.

"అట్లా వుంటే, మీరు ఏది ఇవ్వదలచుకున్నారో అదే ఇవ్వండి."

"కాదు, కాదు, అట్లా కాదు. నువ్వు నీ అంతట అడుగు. అప్పుడే నాకు శాంతి లభిస్తుంది."

"అయితే అమోఘశక్తి అనే అస్త్రం మీ దగ్గర వున్నదిట. అదే నాకు ఇప్పించండి సూర్యభగవానుని ఆజ్ఞ కూడా అదే."

"కర్ణా మంచిది. ఇదిగో అమోఘశక్తి నువ్వు ఉచితమైన వస్తువునే కోరావు. ఈ అమోఘశక్తి ఎవళ్లమీద ఉపయోగిస్తావో వాళ్లు తక్షణం చనిపోతారు. కాని నీవు యిది ఒక్కమారే ప్రయోగించగలవు అని చెప్పి తన అమోఘశక్తిని కర్ణుడికిచ్చాడు.

"కుమారా! ఇప్పుడు కవచకుండలాల బరువు కొంచంతగ్గింది. నేనిప్పుడు వెళ్ళగలను. నేను నీ కవచకుండలాలు తీసుకున్నానన్న విచారమే ఇప్పటిదాకా నన్ను బాధించింది. కాని వాటి బదులుగా నేను నీకు ఏదో కొంచమయినా ఇవ్వగలిగాను. అందుకని నా మనస్సు శాంతి పొందింది. ఈ అమోఘశక్తిని నువ్వు అర్జునుడిమీద ఒక్కడి మీదే వెయ్యగలవు. ఎవరి మీదయినా సరే కేవలం ఒక్కమారే ఇది తన ప్రభావం కనబరుస్తుంది. ఇక వెడుతున్నాను. పరమాత్ముడు శుభం చేకూరుస్తాడు" అని ఇంద్రుడు దేవలోకం వెళ్లిపోయాడు.

కర్ణుడు నిల్చున్నచోటునే వుండి సూర్యునికేసి తిరిగి చేతులు జోడించి భక్తితో కళ్లు మూసుకున్నాడు.

సూర్యుడు కర్ణుణ్ణి సగర్వంగా చూస్తూ ఆశీర్వదించాడు. ★

[హిందీ నుంచి స్వేచ్ఛానువాదం]

# సినిమా

## ★ బొంబాయి సినిమా లేఖ ★

దర్శక నిర్మాత మెహబూబ్ తన క్రొత్త గేవాకలర్ చిత్రం "మదర్ ఇండియా"ను విదేశాలలో విడుదల చేయాలని శాయశక్తులా ప్రయత్నించి విఫలుడయాడు మెహబూబ్‌కు సాధ్యపడని పని మనకెక్కడ సాగి వస్తుందన్న నిరాశతో, చాలమంది బొంబాయి నిర్మాతలు, ఇంగ్లీషులో చిత్రాలు నిర్మించాలన్న ఊహలకు ఉద్వాసన చెబుతున్నారు అమెరికాలో మన చిత్రాలకు చోటు దొరకడం అసంభవం అన్న భావం సర్వత్రా కలిగింది రూపాయలు బట్వాడా చెయ్యడమే తప్ప డాలర్లు సంపాదించుకురావడం జరగనిపని అని అందరూ అనుకుంటున్నారు

దానాదీనా, విదేశీచిత్రాల దిగుమతి పరిమితం చేస్తూ భారతప్రభుత్వం క్రొత్తనియమాలు పెట్టడం చూసి అంతా ఎంతో సంతోషిస్తున్నారు

## కథ మారింది!

అక్కడితో, ఇక్కడి సినిమా యజమానుల వైఖరిలో కూడా మార్పువస్తోంది కేవలం విదేశీచిత్రాలే ప్రదర్శించే థియేటర్లవారు ఇప్పుడు దేశీయ చిత్రాల ప్రదర్శనకు మెల్లిగా అనుమతిస్తున్నారు నగరంలో ఉత్తమశ్రేణికి చెందిన మూడు థియేటర్లలో ఇప్పుడు భారతీయ చిత్రాలు ఆడుతున్నాయి!

రీగల్‌లో ఓం ప్రకాష్ చిత్రం "గేట్ వే ఆఫ్ ఇండియా" ఉంది రాజ్ కపూర్ "జాగ్ తే రహో"తో సామ్యం ఉందని అంటే ఈ చిత్రం ఇక్కడ వారంరోజుల పాటు ఆడుతుంది

రెండోది ఈరాస్ థియేటర్ దీని చరిత్రలో ఇక్కడ మన చిత్రాలు ఆడినది రెండే రెండుసార్లు! ఇక్కడ గతవారం లింక్ ఫిలింస్ వారి "నయా జమానా" ప్రారంభోత్సవ ప్రదర్శనం జరిగింది

బొంబాయినగరంలోకల్లా ఉత్తమం అనతగ్గ మెట్రో థియేటర్‌లో, ఎ వి ఎం వారి, బాలచలనచిత్రం "హమ్ పంఛీ ఏక్ డాల్ కే" విడుదల అయింది

*  *  *



బి ఆర్ చోప్రా నిర్మించిన "నయాదౌర్"లో టాంగావాలాగా దిలీప్‌కుమార్, బస్తీపిల్లగా వైజయంతిమాల

# బొంబాయి సినిమాలేఖ

భారత రష్యాల సంయుక్త నిర్మాణం "పరదేశి" చిత్రంలో పాల్గొనే నిమిత్తం ఇటీవల మరికొందరు భారతీయ నటీనటులు మాస్కో వెళ్లారు. పద్మినీ, రాగిణిల తరువాత వెళ్ళినవారు అచలాసచ్‌దేవ్, మన్‌మోహన్ కృష్ణ, పి. జైరాజ్, బల్‌రాజ్ సాహ్నీ ప్రభృతులు.

* * *

దర్శక నిర్మాత గురుదత్ చిత్రం "ప్యాసా" ఈ వారం రజతోత్సవాలు జరుపుకొంది. క్రితం చిత్రం 'సి. ఐ. డి.' కూడా 25 వారాలు విజయవంతంగా నడిచి ఉత్సవాలు జరుపుకోవడం విదితమే.

తెలుగునటి వహీదా తొలిచిత్రం 'రోజులు మారాయి', ఆంధ్రలో అఖండవిజయం సాధించింది. అలాగే ఆమె పాల్గొన్న తొలి హిందీచిత్రం "సి. ఐ. డి.", రెండో హిందీ చిత్రం "ప్యాసా" కూడా రజతోత్సవాలు జరుపుకొన్నాయి.

"ఇది నా అదృష్టమే అనుకుంటాను" అన్నది వహీదా.

గురుదత్ ఇపుడు బెంగాలీలో "గౌరీ" అనే చిత్రం నిర్మించడానికి సన్నాహాలు చేస్తున్నాడు. ఇందులో నాయక, అతని భార్య, ప్రముఖ ప్లేబాక్ గాయని గీతా (రాయ్) దత్. గాయనిగా సర్వత్రా అభిమానపాత్రురాలైన గీతాదత్, నటిగా ప్రేక్షకుల ఎదట నిలబడడానికి ఇదే తొలిసారి.

* * *

నవకేతన్, అధిపతి దేవానంద్, అతని నటి కల్పన తమ కొత్త చిత్రం "నౌ దో గ్యారా" విడుదల సందర్భంలో, ఢిల్లీ కలకత్తా ప్రదర్శనాలకు హాజరుకావడానికై వెళ్లారు. కల్పన ఇటుపై ఇతర సంస్థల చిత్రాలలో కూడా నటించాలని నిశ్చయించుకుంది.

## కొత్త హీరోయిన్

"వెండితెరకు కొత్త నటిని పరిచయం చేస్తున్నాను" అంటున్నాడు దర్శక నిర్మాత బిమల్‌రాయ్. ఆ అమ్మాయి పేరు 'లిలియన్.' బిమల్‌రాయ్ తీస్తున్న అపరాధ పరిశోధక కథాచిత్రం "అపరాధి కౌన్"లో ఆమె రుంబా సాంబా నృత్యం చేస్తుందట. ఈ వేషంవల్ల ఆమెకు అఖండ కీర్తిప్రతిష్ఠలు రాకపోయినా, త్వరలోనే 'హీరోయిన్' పాత్రలు సంపాదించడానికి దోహదం చేస్తుందంటున్నారు.

## ఖరారైన పుకారు

రాజ్‌కపూర్ నర్గీస్‌లు మాట్లాడుకోరన్న వార్త వట్టి పుకారని ఖరారైంది. నర్గీ

మొన్న మాస్కోనుండి వస్తున్న పృథ్వీ లండన్‌లో దిగి రాజ్‌కపూర్‌ను కలసుకొంది ఇద్దరూ తమ తమ చిత్రాల గురించి, కార్లొవివారీ ఉత్సవంగురించీ మాట్లాడుకొన్నారు

## "దుష్మన్"

క్వాత్రా ఫిలింస్‌వారి "దుష్మన్" ఇటీవలి చిత్రాలలో ఎన్నతగ్గది ఈ ఏడాది దేవానంద్ నటించిన చిత్రాలలో ఉత్తమం అనతగినది

తల్లి పెంపకంలో చిన్నప్పుడే పెడదారి తొక్కి బందిపోటుదొంగగా తయారైన ఒక యువకుడి కథ ఇది పండిట్ ముఖ్‌రాం శర్మ వ్రాసిన ఈ కథను, దర్శకుడు (కొద్ది లోపాలు ఉన్నా) ఆద్యంతం రక్తికట్టేలాగ ఆహ్లాదకరంగా తీర్చిదిద్దారు ముఖ్యభూమికను దేవానంద్ అద్భుతంగా పోషించాడు ఉషాకిరణ్, రాధాకిషన్, ప్రభుదయాళ్, తల్లగా చాంద్ బర్కేలు కూడా ఇందులో ఉత్తమస్థాయినటన ప్రదర్శించారు ఉన్నంతలో, ఈ చిత్రం ఇంత బాగుండడానికి ప్రధాన కారకులు రచయిత ముఖ్‌రాంశర్మ, నటుడు దేవానంద్ అని చెప్పుకోవాలి

సంగీతం అఖండంగా లేదు అబాలగోపాలం చూచి ఆనందించతగ్గ చిత్రం

## నయా జమానా

లింక్ ఫిలింస్‌వారి "నయా జమానా" ఇటీవల విడుదలఅయింది రచన పండిట్ గిరీష్ దర్శకత్వం శేఖ్‌రాజ్ భాక్రీ

స్త్రీలకు విద్య చాలా ముఖ్యమైనదనీ, అవసరమనీ ప్రబోధించడం ఈ చిత్రం లక్ష్యం ఊహ మంచిదేకాని, ఈ సంగతి చెప్పడానికి చాంతాడంత కథఅల్లారు ఇందువల్ల చిత్రం కొంత దెబ్బతింది ప్రతిభాశూన్యమైన దర్శకత్వం, విసుగెత్తడానికి ఇంకొంత సాయంచేసింది

ముఖ్యపాత్ర ధరించిన మాలాసిన్హా, పాత్ర తరహాకు తగనంత భారీగా ఉన్నా, ఎక్కడా అన్యాయం జరగకుండా మంచి నటన ప్రదర్శించి ఒప్పించింది లీలామిశ్రా, బద్రీప్రసాద్, కీ శే గోప్ లు కూడా నటించారు

కథానాయకుడు ప్రదీప్‌కుమార్ సంగీతం ఓ మోస్తరుగా ఉంది; పాటల సాహిత్యం అందుకు తగ్గట్టే ఉంది.

(ఆంధ్రవార పత్రిక బొంబాయి విలేఖరి) ★

## ఆలివర్‌హార్డీ స్మృతి


హాలీవుడ్ హాస్యనటుడు హార్డీ

మహానుదశాబ్దాలపాటు దేశదేశాలవారినీ నవ్వించి, దిగులూ, శోకంగా అనే రెండుపిడలమూ యథాశక్తి తరుమగొట్టిన ప్రఖ్యాత హాస్యనటద్వయం 'లారెల్ అండ్ హార్డీ' లలో 'లావుపాటి శాల్తీ' ఆలివర్ హార్డీ గతవారం లాసేంజల్స్‌లో కాలధర్మం చెందాడు అతని చిత్రాలలో ఏ ఒక్కటీ, ఎంత పాతదీ 'కాలధర్మం' చెందదు. లక్షలాది అభిమానులకు హార్డీ ఎప్పుడూ జ్ఞాపకం ఉంటాడు

ఇతగాడి జతగాడు స్టాన్ లారెల్ కొంతకాలం క్రితం చనిపోవడంతో కొత్తచిత్రాలు తయారుకావడం జరుగలేదు అయితే పాతవెన్నో మనదేశం వస్తూనే ఉన్నాయి ఎన్నోసార్లు చూచిన వారెందరో ఇంకెన్నోసార్లు చూస్తూనే ఉన్నారు ఎన్నిసార్లు చూసినా ఎప్పటికప్పుడు పొట్ట చెక్కలయేలా నవ్వుతూనే ఉన్నారు 1927 నుండి మొన్నటి వరకూ ఈ బ్రిటిష్‌జంట నటించిన చిత్రాలు రెండువందలు పైచిలుకు ఉన్నాయి. వీటిలో కొన్నిటికి నిర్మాత స్టాన్‌లారెల్

వీళ్ళ చిత్రాలు బాగుండడంతో, హాలీవుడ్‌లో యింకోటి బయలుదేరింది—బడ్ అబాట్, లూ కాస్టెలో

* * *

"లారెల్,హార్డీలది అసంగతమైన హాస్యం ఉత్తిచెత్త 'స్లాప్‌స్టిక్ పిల్లలు చూడొచ్చు'" అని గంభీరంగా అర్ధనిమీలిత నేత్రులై ప్రవచించే పెద్దలూ ఉన్నారు

"మానవుడిలో కరుణరసం కొస్తాకరడుగట్టిపోకుండా, మంచిగుణాలనుంచి దూరంపోకుండా కాయకష్టులా కృషిచేసే మహనీయులు" అని జోహారులు అర్పించే మహాభక్తులూ ఉన్నారు

వ్యాఖ్యానాలు చెయ్యకుండా చూచి ఆనందించే లక్షలాది జనమూ ఉన్నారు

పసిపిల్లడి దగ్గర్నుండి పండు ముసలివరకు వాళ్ళవాళ్ళ శక్తినిబట్టి, దృక్పథాన్నిబట్టి, ఒకవిధంగా సంస్కారాన్నిబట్టి, లారెల్, హార్డీల హాస్యం మధురంగా, మధురతరంగా భాసిస్తుంది

నవ్వి నవ్వి, కంటనీరు పర్యంతంఅయి, ఆఖరు క్షణాన, నవ్వించిన మనిషి పట్ల సానుభూతితో, ఆపైన అభిమానంతో, ఒకప్పుడు వాత్సల్య భావంతో బరువుగా మందహాసం చేస్తాడు నిజమైన హాస్యాన్ని ఆస్వాదించిన ప్రేక్షకుడు అదే హాస్యం పరమప్రయోజనం లారెల్ హార్డీలు ఇందులో పరాకాష్ఠను అందుకోలేకపోయినా, చెప్పుకోతగ్గ గొప్పఫలితాలు సాధించారు ★


మెహబూబ్ ప్రొడక్షన్స్‌వారి "మదరిండియా" చిత్రంలో ఒక సన్నివేశం



సరసూవారి "సితారోంసే ఆగే" చిత్రంలో జమాల్, వైజయంతిమాల

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి క్రొత్త చిత్రం 'కొడుకులూ కోడళ్ళు' కు రచన పూర్తి కావచ్చింది సెప్టెంబరు నెలాఖరు లోగా నిర్మాణం ప్రారంభం కాగల దనుకొంటున్నారు

* * *

సంగీతా ప్రొడక్షన్స్ వారి "ఇంటిగుట్టు" వేదాంతం రాఘవయ్య దర్శకత్వాన తయారవుతోంది ఎన్ టి రామారావు, సావిత్రి గుమ్మడి రేలంగి ఆర్ నాగేశ్వర రావు పుష్పవల్లి, సూర్యకాంతం మొదలగు వారు పాల్గొంటున్నారు కథ మాటలూ సదాశివబ్రహ్మం వ్రాశారు పాటలు మల్లాది రామకృష్ణశాస్త్రి సంగీత దర్శకుడు, నిర్మాత ఎం ఎస్ ప్రకాష్

* * *

రిపబ్లిక్ వారి 'ఇళ్ళెందడి' డి యోగానంద్ దర్శకత్వాన తయారవుతోంది హాస్యరస ప్రధానమైన ఈ చిత్రానికి సముద్రాల జూనియర్ రచయిత అంజలి నాగేశ్వర రావు, గుమ్మడి, సి ఎస్ ఆర్, దలం రఘునాథ రెడ్డి డా॥శివరామకృష్ణయ్య, నటిస్తున్నారు సంగీతం ఘంటసాల నృత్యాలు పసుమర్తి కృష్ణమూర్తి నిర్మాత ఎ సీతారాం ★

# ★ సినిమా వార్తలు ★

అంజలీ పిక్చర్స్ వారి జానపదం "సువర్ణ సుందరి" ఈ వారం ఆంధ్ర దేశంలో శతదినోత్సవాలు జరుపుకుంటోంది అంజలి, నాగేశ్వరరావు, రేలంగి గుమ్మడి, రాజసులోచన ప్రభృతులు పాల్గొన్న ఈ చిత్రానికి వేదాంతం రఘువయ్య దర్శకత్వం నిర్వహించారు మల్లాది రామకృష్ణశాస్త్రి పాటలూ, సముద్రాల సీనియర్, జూనియర్ కొసరాజు పాటలూ వ్రాశారు

నిర్మాత ఆదినారాయణరావు, సంగీతం సమకూర్చారు నృత్య దర్శకుడు వెంపటి సత్యం—ఛాయాగ్రహణం రెహమాన్

* * *

శ్రీ వెంకటరమణా ఫిలింస్ అనే క్రొత్త సంస్థకు జూలై 23 వ తేదీ ఉదయం ప్రారంభోత్సవం జరిగింది నేషనల్ ఆర్ట్ థియేటర్ అధిపతి ఎన్ త్రివిక్రమరావు ఎన్ టి రామారావు డి సూర్యనారాయణ రాజు, సముద్రాల రాఘవాచార్య రామానుజం ప్రభృతులు పాల్గొన్నారు

వీరు నిర్మించే చిత్రానికి వేదాంతం రాఘవయ్య దర్శకత్వం వహిస్తారు సంగీత దర్శకుడు టి వి రాజు, నిర్మాతలు బి సుబ్బరాజు, డి నరసింహరాజు

* * *

విశ్వరూపా పిక్చర్స వారు సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు మాటలు పినిశెట్టి, పాటలు వడ్డాది వ్రాస్తున్నారు సంగీత దర్శకుడు రమేష్ నాయుడు

దర్శకుడు శోభనాద్రి ('స్వయం ప్రభ') రావు నిర్మాత శేషగిరిరావు వీరి చిత్రానికి స్క్రిప్టు రచన పూర్తి కావచ్చింది

* * *

# వెనిస్ ఉత్సవంలో 'అపరాజిత'

'పథేర్ పాంచాలి' స్రష్ట సత్యజిత్ రాయ్ రెండవ చిత్రం "అపరాజిత" వెనిస్ అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి ఎన్నిక అయింది

అంతర్జాతీయ ఉత్సవాలలో అగ్రగణ్యం అనదగిన వెనిస్ ఉత్సవంలో, దేశదేశాలనుండి వచ్చే చిత్రాలలో పోటీకి అర్హమైన వాటిని ఎన్నిక చేసే ప్రత్యేక సంఘం ఒకటి ఉంది వచ్చిన వాటిలో ఉత్తమ కళా ప్రమాణాలను అందుకున్న వాటినే ముందర ఎన్నిక చేసే, విశిష్టమైన ఈ 'ప్రాథమిక పరీక్షా' విధానం



శ్రీ వెంకటరమణా ఫిలింస్ కు ఇటీవల ప్రారంభోత్సవం జరిగింది సంగీతదర్శకుడు టి వి రాజు, దర్శకుడు వేదాంతం రాఘవయ్య, నిర్మాతలు, బి సుబ్బరాజు, డి నరసింహరాజు

ఈ ఒక్క చోటనే ఉంది. ఈ సంఘంలో సమర్థులూ, ప్రసిద్ధులూ అయిన చలనచిత్ర కళాకారులూ, విమర్శకులూ సభ్యులు.

ఈ సారి ఇక్కడ ఏటేటా ఇచ్చే సువర్ణ విగ్రహంతోపాటు, ద్వితీయ బహుమతిగా ఒక రజత విగ్రహాన్ని కూడా ఇవ్వ నిశ్చయించారు. ఇదికాక ఉత్తమ నటీనటులకు కూడా చెరొక బహుమతీ ఇస్తారు.

'అపరాజిత' కథ "పథేర్ పాంచాలీ"కి తరువాయి భాగం.

(పథేర్ పాంచాలీ నవలను ఆంధ్ర వార పత్రిక ఇదివరలో సీరియల్ గా ప్రచురించడం విదితమే.)

వెనిస్ ఉత్సవం అనంతరం, "అపరాజిత" చిత్రాన్ని లండన్, పారిస్ ప్రభృతి నగరాలలో కూడా ప్రదర్శిస్తారు. దర్శకుడు సత్యజిత్ రాయ్ ఇందుకై మొన్ననే వెనిస్ నగరం వెళ్లారు. 

# సముద్ర గర్భంలో వర్ణ దర్శనం

# నిశ్శబ్ద ప్రపంచం

అబ్ధి గర్భంలోని నిశ్శబ్ద ప్రపంచాన్ని దర్శించడం అందరికీ సాధ్యంకాదు. అది సాధించిన కొందరు, ఆ ఆనందానుభూతిని అందరికీ అందించాలన్న సంకల్పంతో, అధునిక సాధనం చలన చిత్రం ద్వారా ప్రయత్నించారు. ఆతరహా చిత్రాలు చిన్నచిన్నవి ఇదివరలో ఐదారుతీసి చూపిన ఫ్రెంచి నావికుడు జాక్వే కూస్తో ఈసారి 11 నెలలపాటు మధ్యధరా, హిందూమహాసముద్ర గర్భాలలో యాత్ర చేసి నేత్రపర్వమనతగ్గ చిత్రాన్ని నిర్మించాడు. "సైలెంట్ వరల్డ్" అనే పేరుతో కొలంబియా పిక్చర్స్ వారు ఈ చిత్రాన్ని ఆగస్టు 16 న మద్రాసు ఓడియన్ థియేటర్ లో విడుదలచేశారు. పదవ తేదీ ఉదయం పత్రికల వారికి చూపించారు. మద్రాసురాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ అధ్యక్షుడు శ్రీ పి. వి. చెరియన్ ఈ ప్రదర్శనానికి అధ్యక్షత వహించారు. నగరంలో ప్రముఖ విద్యావేత్తలు పలువురు దీనికి హాజరయ్యారు.

సముద్రం ఉపరితలాన ఎంత ఘోష ఉంటుందో, అంతరంగంలో అంతటి చైతన్యం ఉంటుంది. తిండికితిప్పలుపడుతూ, ఆత్మరక్షణ కోసం తాపత్రయపడుతూ, ఆ బెంగ లేనపుడు జంటచూసుకుని కులాసాగా షికార్లు చెలాయిస్తూ కడలి కడుపులో తిరిగే రకరకాల రంగురంగుల జీవకోటి చైతన్యాన్ని, నిశ్శబ్దమే సంగీతంగా దర్శించడం ఒక మహత్తర అనుభూతి. ఇంతకు మించి ఇందులో రక్తికట్టే కథ ఏమీ లేదు. ఎప్పుడూ ఇంకేవిధంగానూ సాధ్యపడని వర్ణార్ణవ దర్శనమే ఈ చిత్రం ప్రధానాకర్షణ.

ఇందుకోసం "కూస్తో" బృందం, అమెరికన్ నౌకాదళానికి చెందిన "కాలిప్సో" అనే నౌకను సంపాదించింది. ఇందులో ఆధునిక పరికరాలు అన్నీ ఉన్నాయి. ఓడ నడుస్తున్నపుడు సముద్రంలో 20 అడుగుల లోపల ఏం జరుగుతోందో చూడడానికై అద్దాలమర్చిన ఒక గొట్టంవంటిది ఉంది. నావికులు (వీరిలో సముద్రగర్భ పరిశోధన జరుపవచ్చిన శాస్త్రజ్ఞులు కొందరున్నారు.) ప్రాణవాయువు సరఫరా చేసే సాంగులు అమర్చుకుని, కెమేరాలు పట్టుకుని ఓడకు లంగరువేసి, నీటిలో దిగేవారు. 40 నిలువుల లోతుకువెళ్ళి, ఎన్నడూ సముద్రం పైకిరాని జలచరాల తీరుతెన్నులను పరిశీలించి, సెల్యులాయిడ్ మీదకు ఎక్కించేవారు. సముద్రం అడుగున ఉంచే చిత్ర

విచిత్ర వృక్షజాతుల చిత్రాలను తీశారు. భయపడి పారిపోయే చేపలకు, ఆహారంపెట్టి మెల్లిగా మచ్చికచేసుకునేవారు! 60 పౌనుల బరువుండే అపురూపమైన చేప ఒకటి ఒకసారి వీరితో జత కట్టింది. దానికి "యూలిసిస్" అని పేరు పెట్టారు ముద్దుకి. ముందర దాన్ని మంచిచేసుకోవడానికి 'కూస్తో' కొత్త కొత్త మాంసం ముక్కలు పెడుతూవచ్చాడు. అవి మరిగి అది వారి వెంట పడింది. వచ్చినపని చూసుకుని, ఇతర ప్రాణులను చేరదీసి చిత్రాలు తీయబోయినపుడుకూడా ఇది అడ్డు తగిలేది. మిగతావి భయపడి దూరంగా పోయేవి. చివరకి, 'కూస్తో' ఒక ఉక్కుబోను సముద్రంలోకి దింపి, 'యులిసిస్'కు తాత్కాలికంగా ఖైదు శిక్ష విధించవలసి వచ్చింది!

సముద్రంలో అపురూపమైన చేపలు కనబడి, పారిపోతున్నపుడు వెంట తరుమడానికి వీలుగా, వీళ్ళు చిన్నచిన్న 'సబ్మెరిన్' యంత్రాలు కట్టుకున్నారు. విద్యుచ్ఛక్తితో పనిచేసే ఆ యంత్రాలు సన్నటి పీపాలలా ఉంటాయి. మీటనొక్కి దాన్ని పట్టుకుంటే, సునాయాసంగా, చేపల వేగంతో ఈ నావికులు కూడా సముద్రగర్భంలో ప్రయాణంచేసేవారు.

ఏ చేపనీ అనవసరంగా చంపడం వీరిమతం కాదు. ఒకసారి తిమింగలాల మంద తటస్థ

(55-వ తరువాయి)



'యూలిసిస్'ను ఖైదులో వేసిన జాక్వెస్ కూస్తో.



భారత రష్యన్ కళాకారులు కలసి నిర్మిస్తున్న చిత్రం "పరదేశి" లో రష్యన్ యాత్రికుడు అఫనాసీనికిటిన్ గా ఒలెగ్ స్ట్రిజినోవ్.

# అదీ - ఇదీ

పిల్లలకోసం ప్రత్యేక చలనచిత్రాలునిర్మించే కార్యక్రమంపట్ల మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకశ్రద్ధ వహించింది.

విద్యామంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం అధ్యక్షతన ఇందుకు ఒక సంఘం ఏర్పడింది మద్రాసు మేయరు శ్రీ శ్రీనివాసన్, కమిషనర్ శ్రీ బాల సుబ్రహ్మణ్యం, విద్యాశాఖాధికారి శ్రీ సుందరవడివేలు, చలనచిత్ర పరిశ్రమ తరఫున శ్రీయుతులు ఎ. వి. మెయ్యప్పన్, ఎం. జి రామచంద్రన్, కె. సుబ్రహ్మణ్యం. శ్రీమతులు సౌందరం కైలాసం, వల్లముత్తు రామమూర్తి, సరోజనీ వరదప్పన్, ఇందులో సభ్యత్వం స్వీకరించారు రాష్ట్ర సమాచార శాఖాధికారి శ్రీ దివ్యం దీనికి సమావేశకర్త బాల చలన చిత్రసంస్థ కార్యదర్శి శ్రీ మహేంద్రం షాఫ్ ఈసంఘానికి ప్రారంభోత్సవం జరిపారు.

ఆసంస్థ నిర్మించిన "జల్ దీప్" చిత్రాన్ని మొదట తమిళంలోకి డబ్ చేస్తున్నామని, ఆపైన, తమిళ దేశానికి సంబంధించిన ఇతి వృత్తాలతో తమిళంలోనే చిత్రాలు నిర్మిస్తామనీ అధ్యక్షుడు శ్రీ సుబ్రహ్మణ్యం తెలియచేశారు

రెండవ ప్రణాళికలో బాల చలనచిత్ర సంస్థ కార్యక్రమాలకై ఇరవైలక్షల రూపాయలు కేటాయించారన్న విషయం విదితమే. మద్రాసు కార్యక్రమాలకై ఈ ఏడాది వారి దగ్గర కొంత సహాయం తీసుకుంటారు, రాష్ట్రప్రభుత్వం కొంత మంజూరుచేస్తుంది. ఆపైన, డబ్బింగ్ వంటి వాటికి అట్టే ఖర్చుకాకుండా, ఉచితంగా పని చేయడానికి మద్రాసు నటీ నటులు పలువురు సంసిద్ధత తెలియచేశారు.

* * *

చార్లీచాప్లిన్ కొత్తచిత్రం "ఎ కింగ్ ఇన్ న్యూయార్క్" నిర్మాణం పూర్తి అయింది. వచ్చేనెల లండన్లో ఆరంభ ప్రదర్శనం జరుగుతుంది.

ప్రసిద్ధ బ్రిటిష్ రచయిత ఆల్డస్ హక్స్లీ, చాప్లిన్ ఆహ్వానం పురస్కరించుకొని మొన్న నీ చిత్రాన్ని చూచారు.

"మాడర్న్ టైమ్స్" "గ్రేట్ డిక్టేటర్" చిత్రాల శ్రేణిలో ఉన్న ఈ చిత్రం ఆ జోడుకు యోగ్యంగా ఒప్పుతుందని ఆయన మెచ్చుకున్నారు. ఇందులో చాప్లిన్ చూపించిన హాస్యం, సునిశిత విమర్శ నాయుతమైనదైనా, వేసవికాలపు మెరుపులా విధ్వంసం చేయని తరహాదని, ఎవర్నీ నొప్పించకుండా, అందర్నీ — ఆఖరుకు విమర్శకు గురిఅయిన అమెరికన్లను సహా — మెప్పించగలదనీ హక్స్లీ ప్రశంసించారు.

# మోహనంగారి కంగారు

అనగనగా ముగ్గురమ్మాయిలు. ముగ్గురూ 'ల' కారాంత నామధేయులు (కమల, నిర్మల, లీల); లలిత లతాంత ప్రాంతలు.

డబ్బూ, అందుకుతగ్గ రూపురేఖలూ, వాటికి దీటైన హుషారూ ఉన్న ఒక టింగు రంగారావుని చూసి ముగ్గురూ ముచ్చట పడారు. పేరు మోహన్. అతగాడికి సర్వ సమతా సిద్ధాంతంమీద నమ్మకం ఉంది. పక్షపాతం లేదు. అయినా ఉన్నంతలో కమలకు హృదయం పరటా ఇచ్చాడు. కమల అతని మిత్రుడి చెల్లెలు. సన్నగా సళాకలా, చలాకీగా ఉంటుంది. లీల అతనికి మేనమామ కూతురు. అందుకని ఆ అమ్మాయి ప్రేమలో, కాస్తంత హక్కు ఉందన్న టెక్కు, ధీమా చేసుకున్నంత ధీమా ఉన్నాయి.

మోహనరావు కమలను మోహించాడని, తనను ప్రేమించాడనీ భావించిన లీలకి, బావ తనగురించి పట్టించుకోవడం లేదన్న సంగతి లీలగా తెలియడంతో మనసు చివుక్కుమంది. బాధ, కోపంగా, దరిమిలా కసిగా తర్జుమా అయిపోతుంది ప్రేమవేదం, 'సామ' వేదం, 'బాష్ప' వేదం అయిపోయాక, 'భేద' వేదం అవలంబిస్తుంది లీల. ఎలాగైనా మోహన్‌ను తనవాడుగా చేసుకోవాలన్న తపనతో, యథాశక్తి ఆలోస్తుంది. ఒక రోజున, నాటకానికి వెళదామన్న కమల ఆహ్వానాన్ని కాదని, మోహన్ ఎక్కడకో వెళ్తున్న వేళ, లీల అడ్డుతగిలింది.

"మావయ్య అర్జెంటుగా రమ్మన్నాడు. ఏదో కాయితంమీద సంతకం పెట్టాలిట" అంది.

మోహన్‌కి అర్థం కాలేదు. అంత అర్జెంటు కాగితం ఏమిటో ననుకుంటూ, సరే అంటూ, కారులో కూర్చున్నాడు.

లీల కారు స్టార్టు చేసింది తృప్తిగా.

లెక్కప్రకారం, కమల, ఆ జంటని చూసింది. తను నాటకానికి పిలిస్తే రానని, లీలతో కారుషికారు చెలాయిస్తున్నాడని హడావుడిగా దురభిప్రాయపడిపోయి, మహా కోపంగా ఇంట్లోకి వెళ్లిపోయింది.

"నమ్మరాదే చెలీ" అనేపాట, ఆమెకు జ్ఞాపకం వచ్చినా కోపంమూలాన శ్రుతి కుదరదని పాడలేదనుకోవచ్చు.

ఈ విధంగా ఆ తలోదరి, గబగబా లోపలికి వచ్చేసరికి ట్రాలీమీద కెమేరా, దాని వెనక ఛాయాగ్రాహకుడు లక్ష్మణ్‌గోరే ఎదురేగి స్వాగతం ఇచ్చారు.

అందుకని కమల 'క్లోజప్'లో కోపం నటించి 'హుఁ' అంది. తక్షణం కెమేరా వెనకంజ వేసింది. కమల సోఫాలో కూలబడి, ఉత్తరార్థ క్షణంలో లేచి నిలబడింది.

'అమ్మాయిగోరికి శానాకోపం వచ్చిం'దని పసిగట్టేసిన నౌకరు రామదాసు పాత్రధారి రామకోటి, సాధ్యమైనంత బేఖాతరీగా, కులాసాగా "లంబిడోళ్లా రామాదాసా" పదం పాడుకుంటున్నాడు. తుడిచిన బీరువాలనే మళ్లీ మళ్లీ తుడుస్తూ.

"రామదాసూ! మోహనంగారొస్తే లేనని చెప్పు" అంది కమల కంగారుగా.

కమల కోపంసంగతి కారులోంచే గమనించిన మోహనంగారు, అంతకన్నా కంగారుగా, బూట్లు టక టక చప్పుడు చేసుకుంటూ వచ్చేస్తున్నారు. అందుకని, కమల గబగబ పరుగెత్తి దభేలున తలుపు మూసేసింది.

ప్రేమ జీవులకు ఇహ లోకద్వారబంధాలు అడ్డు కానేరవుగదా! అన్న అర్థాంతరన్యాసం ఆసరాచూసుకుని, ఇంకో క్షణంలో ఆమె తలుపు తెరవడం, అతడు లోనికి రావడం, "అది కాదు కమలా" అని సంజాయిషీ ఆరంభించడం, ఆమె కోపం ఇనుమడించడం ఆ పైన అతడు మళ్ళీ టకటక బూట్లు చప్పుడు చేసుకుంటూ నిష్క్రమించడం జరిగిపోయాయి.

"హోల్డాన్..." అన్నారు దర్శకుడు తిలక్ నవ్వుతూ.

* * *

"ఇది మాకథకు ఒక ఉపవృత్తం" అన్నారాయన ఆ సన్నివేశాన్ని వివరిస్తూ.

"రామాయణంలో పిడకలవేట" అన్నారు రచయిత ఆరుద్ర నవ్వుతూ.

ఆ రామాయణం ఆధునిక రాజకీయాల కథ. పేరు "ఎం. ఎల్. ఎ." అనుపమా వారి చిత్రం.

ఈ పిడకల వేటలో మోహన్ పేరు రమణమూర్తి. ఆ అమ్మడు కమల పేరు గిరిజ.

ముఖ్యపాత్ర నిర్మలగా సావిత్రి నటిస్తూంది. కథానాయకుడు జగ్గయ్య. గుమ్మడి, పెరుమాళ్లు, రమణారెడ్డి, చదలవాడ, సూర్యకళ ప్రభృతులు కూడా పాల్గొంటున్నారు.

ఆదర్శాలకూ, ఆదర్శవాదులకూ ఉండే చిట్టరికపుస్వరూపస్వభావాలని తెలుగుదేశపు రాజకీయ వాతావరణంలో నిలిపి చూపించే ఈ చిత్రానికి తాపీధర్మారావు, ఆరుద్ర రచన చేస్తున్నారు. సంగీతం పెండ్యాల. కె. బి. ("ముద్దు బిడ్డ") తిలక్ దర్శకత్వం నిర్వహిస్తున్నారు. ఈ చిత్రం సెప్టెంబరులో విడుదల కాగలదని తిలక్ చెప్పారు. ★



అనుపమావారి 'ఎం. ఎల్. ఎ' చిత్రంలో కొత్త నటుడు రమణమూర్తి, గిరిజ.

## ఏ. వి. ఎం. వారి
# "హం పంఛీ ఏక్ డాల్ కే"

"నా బిడ్డ బంగారు తండ్రి. అందరికీ ఇలాటి బుద్ధిమంతులే కలగాలి" అంటూ కొడుకు శిరసును ఆఘ్రాణించి ఆనందపడింది ఒక పేదరాలు.

"నా కడుపున చెడబుట్టాడు వెధవ. ఈ వంశం పేరు ప్రతిష్ఠలు నేలకలిపేస్తున్నాడు" అని మండిపడ్డాడు ఒక జమీందారు తన కుల దీపకుని చూచి.

* * *

నిజానికి బిడ్డలిద్దరూ బుద్ధిమంతులే. తేడా ఉన్నది పెద్దలలో. తన కొడుకు బీదపిల్లలతో కలిసి ఆడుకుంటున్నాడని కోపం వచ్చింది జమీందారుగారికి. అది తగదనీ తప్పు అనీ ఆయన నమ్మాడు. తప్పు తనదే నన్న సంగతి, "హం పంఛీ ఏక్ డాల్ కే" సినిమాలో చివరిసీను చూచేదాకా ఆ జమీందారుకు బోధపడలేదు. చూడగానే అది బోధపడింది; తన అభిప్రాయాల్ని మార్చుకుని మనసుని మరమ్మతు చేసుకున్నాడు.

ఈ చిత్రాన్ని మొదటి నుండీ చూచిన జమిందార్లు, అంతకన్న చప్పునే తమ దురభిప్రాయాలను (ఉంటే గింటే) మార్చుకోవాలి లెక్క ప్రకారం.

ఏ. వి. ఎం. పేరిట సదాశివ్. జె. రావ్ కవి నిర్మించిన చలనచిత్రం "హం పంఛీ ఏక్ డాల్ కే" (మన మందరం ఒక చెట్టు పక్షులమే.) లక్ష్యం ఇదే. పెద్దవాళ్ళ బుద్ధులు మార్చిన పిన్నల కథ. దర్శక రచయిత సంతోషీ, దీన్ని పిన్నలూ పెద్దలూకూడా చూడతగ్గరీతిన రూపొందించారు.

చిన్న కథ. దానికి తగినంతగానే చిత్రం నిడివి (11600 అడుగులు). పిల్లలు చూచి మెచ్చుకోతగ్గ ఆటలతో, పాటలతో, సున్నితమైన హాస్యంతో ఆహ్లాదకరంగా తయారైన ఈ చిత్రంలో మాస్టర్ రోమి, డెయిసీ ఇరానీ ఉరఫ్ రూప్‌కుమార్, సతీష్ ('తుఫాన్ ఔర్ దీయా') వ్యాస్, జగదీప్, మోహన్ ఛోటీ, ప్రభృతి బాలనటులూ, డేవిడ్, మారుతి, మురాద్, నిరంజన్ శర్మ, బి. ఎం. వ్యాస్, పురాణిక్, అచలాసచ్‌దేవ్ మొదలగు పెద్దలూ పాల్గొన్నారు.

అనగనగా ఒక జమిందారు. అతని కొడుకు రాజన్. అతడు బడి పిల్లలలో బీద పిల్లలతో ఆడుకోవడం తండ్రికి గిట్టలేదు. 'ఖాన్‌దాన్ కే ఇజ్జత్'కు పెద్దదెబ్బ అనుకున్నాడు. కొడుకు అలా అనుకోలేదు. అందుకని, వాళ్ళమ్మకి చెప్పి, నాన్నని అడక్కుండా తోటి పిల్లలతో కలసి విహారయాత్రకి వెళ్ళాడు.

దారి పొడుగునా ఆడుతూ, పాడుతూ, దర్శకుడు సంతోషీ దేశానికి ఇవ్వదలచుకున్న సందేశాలను ఆ పాటల ద్వారా బట్వాడా చేస్తూ, శ్రమదాన కార్యక్రమలలో చొక్కా లాగూ మడత నలగకుండా ఫోటోజెనిక్‌గా పాల్గొంటూ, ఊరూరా ఆడిపాడి డబ్బులు పోగేసి ఆ ఊరి బీదపిల్లలకే మళ్ళీ విరాళం ఇస్తూ ఖులాసాగా తిరుగుతాడు—ఈలోగా తండ్రి మండిపడి, ముందర బంట్రోతునీ, ఆనక గుమస్తానీ పంపి, ఆ పైన తనే బయల్దేరుతాడు కొడుకుని 'చెడు సావాసాల' బారి నుండి వేరు చేదామని. ఆ వేళకి రాజన్ అండ్ కంపెనీ వారు ఝూంఝుని పాడుతూ ఇంటికొచ్చేసి ఇంకో నాటకానికి రిహార్సలు ఆరంభిస్తారు. జమిందారుకి కోపం వచ్చి, కొడుకుని బడికి పంపనంటాడు. అని ఒక మాజీసర్కస్ రింగు మాస్టర్ని ప్రవేటుమాస్టరుగా పెడతాడు.

నేస్తాలను కలుసుకోవడంకోసం, ప్రబంధ నాయికలా ఆపసోపాలు పడుతున్న రాజన్ (మాస్టర్ రోమి) తప్పనిసరిగా తండ్రికీ, మాస్టరుకీ టోకరా ఇస్తాడు. తన గదిలో, ఇంకో చిన్నసైజు జతగాడిని (రూప్ కుమార్, లేక డెయిసీ ఇరానీని) కూచో పెట్టి డాన్ వాన్, కొసనోవాలను మించిన ధైర్యసాహసాలతో తను కిటికీమూకి, నాటకం రిహార్సలుకు ఉడాయిస్తాడు. రూప్ కుమార్, రింగుమాస్టరూ పాతపుస్తకాల్లోని పొడుపుకథలతో, పిట్టకథలతో (ఒక చెట్టున పది పిట్టలున్నాయి. వేటగాడు తుపాకితో ఒక పిట్టనికొట్టాడు. అక్కడున్న వెన్ని?... ఒకటే అంటాడు రూప్‌కుమార్. మిగతావి పారిపోతాయిగా అంటాడు క్లోజప్‌లో ముద్దుగా కళ్లుతిప్పుకుంటూ.) తంటాలు పడుతూ ఉంటారు.

మరి మంచిపిల్లవాడు రాజన్, ఇల తల్లిదండ్రులకూ, గురువుకూ టోకరాయి నాటకాల రిహార్సల్సుకు వెళ్ళడం తప్పు కాదూ? చదువుకోవద్దూ? దేశవాళీ సినిమా

## "హం పంచీ ఏక్ డాల్ కే"

హీరోలందరి లాగా, ఈ పిల్లల చిత్రకథానాయకుడు కూడా దుస్సాధ్యాలను అవలీలగా చేసి అవతలపారేస్తాడు. ఓపక్క నాటకం రిహార్సలు వేస్తూనే మరోపక్క పెద్దకొను కుర్రాడిదగ్గిర లెక్కలూగట్రా నేర్చుకుంటూ ఉంటాడు సాయంత్రపు గంటన్నరలోనూ. ఆ నాటకంలో తన పోర్షనేకాక, ఇతర పోర్షన్లు కూడా కంఠతా పట్టేస్తాడు. అలా చేసినందువల్ల మంచే జరిగింది. ఎందుకంటే, నాటకం ఆడేరోజునే రూప్‌కుమార్ తెలివితేటలు ప్రతిఫలించిపోయి, విత్తుముందా చెట్టుముందా అని గురువుని అడిగేశాడు. అక్కడితో అతడికి గుటకపడక, "అయ్యా మీ ప్రహ్లాదుడిప్రజ్ఞ మీరు పరీక్షించవచ్చు" అని జమీందారుని ప్రవేటు గదిలోకి పిలుస్తాడు. అక్కడితో రాజన్ గుట్టు బయటపడుతుంది. తక్షణం, తండ్రి హిరణ్యకశిపుడైపోయి, సరాసరి నాటకశాలకి వెళ్తాడు. ఆసంగతివిని స్టేజిమీదవున్న రాజన్ కంగారుపడతాడు. తత్ఫలితంగా అతడు పట్టుకున్న నిచ్చెనపడిపోయి దానిమీదవున్న అతని మిత్రుడు (నాటకంలో ముఖ్య పాత్రధారి) కింద పడతాడు. అందువల్ల రాజన్ ముఖ్యపాత్ర ధరిస్తాడు. అన్ని దేశాల ప్రజలూ, అన్నిజాతులవారు సమానులేననీ, ఒకే కుటుంబంవారనీ తెలియచెబుతూ కొడుకు పాడినపాట విని తండ్రి మెల్లిగా వాలికచ్చకుని, తన పొరపాటు లీలగా తెలుసుకుని పశ్చాత్తాపపడడం మొదలుపెడతాడు.

ఆ రాత్రి రాజన్ ఇంటికి రాకుండా వ్యాతగిలిన నేస్తానికి సేవచేస్తూ పూరిగుడిసెలో ఉండిపోతాడు. పొద్దున్నే జమీందారు వెతుక్కుంటూ ఆ కుటీరం గడపలో నిలిచేవేళకు, తల్లి ప్రేమ, తండ్రి ప్రేమ గురించిన డైలాగులు వినబడతాయి. బీదపిల్లవాడి తల్లి, రాజన్‌కు నీతి చెబుతోంది.

"ఓహో బీదవాళ్ళూ మంచివాళ్లేన్నీ"అని జమీందారు గ్రహించి చెంపలేసుకుంటాడు. ఇదీ కథ. ఈ విధంగా, దీనికి 'సినిమా కథ' లక్షణాలు ఎక్కువగా ఉన్నా, దర్శకుడు సంతోషి, కథకన్న వివిధ సన్నివేశాల చిత్రణకు ఎక్కువ ప్రాధాన్యంఇచ్చి దీనిని రాణింపచేశారు. పిల్లల నటన, నృత్యాలూ బాగున్నాయి. కంటికి నదరుగా, ఆహ్లాదకరంగావున్న ఛాయాగ్రహణం ఇందుకు మరింత దోహదంచేసింది.

సంగీత దర్శకుడు ఎన్. దత్తా కూర్చిన పాటలు, కొన్ని ఇతరచిత్రాలలో పాటల బాణీలను పోలివున్నా, వినడానికి హుషారుగా, పిల్లలు పాడుకోడానికి వీలుగా ఉన్నాయి.

బాలల చిత్రాలు నిర్మించడానికి దక్షిణభారతంలో ఎ. వి. ఎం. వారు చేసిన ఈ తొలిప్రయత్నం అనేక విధాల ప్రశంసనీయంగా ఉంది.

కథ అల్లడంలోకూడా మరికొంత జాగ్రత్త వహించి ఉంటే ఎ. వి. ఎం. వారు అనేకులకు మార్గదర్శకులయేవారు.

పిల్లలందరూ చూడతగ్గ చిత్రం ఇది. ★

## "నిశ్శబ్ద ప్రపంచం"

(51-వ పేజీ తరువాయి)

పడింది. ఓడకి పదిగజాల ముందరగా అవి ఆడుతూ పాడుతూఉంటే, వీళ్ళు చిత్రాలు తీస్తూ వాటిని పరిశీలిస్తూ వెంబడించారు. ఒక చిన్న తిమింగలం తిన్నగా ఉండక ఓడ అడుగు భాగానికి వెళ్ళింది. పెద్దదెబ్బతిని, కొద్దిసేపటిలోనే చనిపోయింది. మెల్లిగా ఒక సొరచేప వచ్చింది. మేత దొరికిందన్న వార్త క్షణంలో వ్యాపించిపోయింది. ఇంకో క్షణంలో పెద్ద సొరచేపలమంద తిమింగలాన్ని చుట్టుముట్టింది నావికులకు సొరచేపలంటే మాత్రం ఎక్కడలేని కోపం. ద్వేషం. బాగా దగరకు రానిచ్చి. మహాకసిగా ఆ మందని హతంచేసివేశారు. ఇలా పదకొండునెలలూ రెండు మహాసముద్రాలలో సాగిన సాహసయాత్రానుభవాలను "జాక్వెకూస్తో" మనోహరమైన ఈ చలన చిత్రంగా రూపొందించాడు.

అద్భుతాలు చూచి ఆశ్చర్యపడేశక్తి కోల్పోయిన వారిసంగతి ఆ ప్రస్తుతం; చూడాలన్న కుతూహలం, ఉన్నవారంతా తప్పక చూడతగ్గ చిత్రం. కడలిగర్భంలోని ఈ రంగుల నిశ్శబ్ద ప్రపంచం, చూస్తున్నంతసేపూ, మధురమైన స్వప్నంలా కన్పిస్తుంది. ఆ స్వప్న జగతి గతికి లయగా వినిపించే నేపథ్య సంగీతం భావకు అందని మహత్తర వ్యాఖ్య అనిపిస్తుంది. ★

(15-వ పేజీ తరువాయి)

తప్పుడి పచ్చడి చేస్తాడేమోనని భయం.

అందరూ సోమశేఖరం చుట్టూ చేరి సంగ తేమిటో తెలుసుకుంటున్నారు.

"ఆ ఏముందీ? వాడిమీద ఎవరో ఆకాశ రామన్న ఉత్తరాలు రాశార్ట. నేను రాశా నని అనుమానం." అని సంగ్రహంగా చెప్పాడు. అతనికి తెలుసు ఆ ఉత్తరం వ్రాసిందిలింగమూర్తనని. చేసేదిఇంకొకరైనా అనుమానం తనమీదకే వస్తుందని కూడా తెలుసు.

తన కసలీ గుమాస్తా ఉద్యోగం ఇష్టంలేదు. ఆత్మాభిమానం చంపుకుని చీము నెత్తురు లేకుండా బ్రతకడం అలవాటు చేసుకుంటే ఈ ఉద్యోగం చెయ్యాలి. తనకు దీనికి ఉత్తర దక్షిణ ధ్రువాలకున్నంత తేడా. తన లాంటివాడి కిది కుదరని పని. ఈ ఆలోచన లతో ఉడుకెత్తిపోతూ కుర్చీలో చతికిల పడ్డాడు సోమశేఖరం.

"సార్! మేనేజరు పిలుస్తున్నాడు" అంటూ జమాను వచ్చాడు.

"వస్తాలే ఫో అవతలికి" అని అరిచేప్పటికి వాడు ఎగిరి బల్లమీద పడబోయి తట్టుకుని వెళ్ళిపోయాడు గొణుక్కుంటూ. మెల్లిగా లేచివెళ్లాడు సోమశేఖరం మేనేజరు గదికి.

"ఏమిటి శేఖరం యిందాకటి గలాటా!" అని ప్రశ్నించాడు మేనేజరు.

"రావు చెప్పలేదూ మీకు!"

"చెప్పాడనుకో!...చూడూ!...ఎంత పెద్దా నీకంటే పైఅధికార్లుకదా...అంత తలబిరుసుగా సమాధానం చెబితే వాళ్ళ కెలా ఉంటుందో ఊహించావా!" అదో ధోరణిలో అన్నాడు.

"నేను చెయ్యని పనిని చేశానని ఒప్పుకో మంటారా!"

"ఆయన కోపంలో అలాగన్నా డనుకో. అప్పటి కూరుకుంటే."

"నాకేమిటి కోపంలేంది!...మీరూ అలా అంటారని తెలుసు."

"నే నెందుకు చెబుతున్నానో విను... నీవూ పిల్లలుగలవాడివే గదూ!...మీ అబ్బాయి ఒకతప్పు చేస్తాడనుకో. నీకుకోపం వస్తుంది...వెర్రికోపం వస్తుంది...అప్పు డేంచేస్తావ్!" మేనేజరు ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఎంత కోపం వస్తేమాత్రం వాడి భవి ష్యత్తు నాశనం చెయ్యడానికి చూడంగా"

'నీమాట నిజమే! కాని...అలా చేసే వాళ్ళుకూడ లేకపోలేదు...ఇంతకూ చెప్పే దేమిటంటే నీవు ఎక్కడకువెళ్ళినా ఎక్కువ తక్కువ లనేవి అధికారహోదాల్లో తప్పవు ... నీది యువకరక్తంగనక అలా అనిపి స్తుంది...అంతే," ఒక నిట్టూర్పు విడిచి మళ్ళీ ప్రారంభించాడు.

"ఇంత సర్వీసు ఉన్నది నాకు. తల నెరి సింది. ఇంటికి వెళ్తే కొడుకులు ఎంతో గౌర వంగా చూస్తారు. కాని... నేనే ఒక్కో సారి...పైవాళ్ళచేత తిట్లు తినాల్సి వస్తుం టుంది. అది నీకు తెలీని కొత్త విషయమేమీ కాదు."—ఆగాడు. ఫ్లాస్కులోని కాఫీ జమాను గ్లాసులో పోసిస్తే అందుకుని కాసిని చప్పరించాడు.

సోమశేఖరానికి మేనేజరు చెప్పి దానిలో సత్యం గోచరించింది. అయినా అంత వాత్సల్యంతో తనతో మాట్లా డతాడని అనుకోలేదు. అనేకసార్లు ఆయనతో కూడా తిరస్కారంగా, ఎంతో నిర్లక్ష్యంగా మాట్లాడాడు. తిరిగి చివాట్లు తిన్నాడు.

పశ్చాత్తాపమనేది ప్రతి మానవహృద యానికి సహజమనేది అతనికి బోధపడింది.

కాఫీ తాగడం పూర్తిచేసి "యిక వెళ్ళు" అన్నాడు.

"థేంక్యూ సార్" అని వెనక్కు తిరిగి కళ్ళనుంచి రాలబోతున్న అశ్రుబిందువుల్ని చేతిగుడ్డతో అద్దుకుంటూ వచ్చి తనకుర్చీలో కూర్చున్నాడు.

గతమంతా ఒక్కసారి కళ్ళముందు మెది లింది. ఎంతకష్టపడి పనిచేసినా అధికారుల దృష్టిలోఅవకతవక గాకనుపిస్తేపడినశ్రమంతా వృధే! తనుఅయిదేళ్ళు ఉద్యోగంలేక నానా యాతనాపడ్డాడు. మంచికే వచ్చిందో చెడ్డకే వచ్చిందో ఈ నౌకరీ వచ్చింది. ఉద్యోగం వచ్చినప్పుడు అమ్మ నాన్నా పొంగిపోయి సత్యనారాయణవ్రతం కూడ చేయించారు. మేనేజరు చెప్పినట్టు ఉద్యోగం అన్నతరు వాత ఎక్కువ తక్కువలు, హోదాల్లో తేడాలు ఉండితీర్తాయి. పైవాళ్ళ దబా యింపులు కిందివాళ్ళు పడుతూనే ఉండాలి. ఎదురుతిరిగితే తనకే ముప్పు!

ఇంతలో రాజు వచ్చాడు. "ఏమిట్రా మేనేజరు హితబోధ చేస్తున్నాడు," అన్నాడు నవ్వుతూ.

"చూశావురా, లింగమూర్తి ఎంతపని చేశాడో!"

"ఆపని చేసింది లింగమూర్తి కాదు నాయనా, ఆ రావుగాడేరా" అన్నాడు మెల్లిగా.

ఆ మాట వినగానే కుర్చీలోనుంచి లేచాడు పంజాబు పహిల్వానుపోజులో రావును నలిపి అవతల పారెయ్యాలన్నంత కోపంతో సోమశేఖరం.

"ఆగరా! ఆగు...మేమంతా యిందాక నే చివాట్లు పెట్టాం. వాడసలే సగం చచ్చి ఉన్నాడు. ఇంకా ఏం చంపుతావ్ కూర్చో"

"వాడు రాశాడని ఎలా తెలిసింది" అన్నాడు కూచుంటూ.

"మనమందరం ఆకాశరామన్న ఉత్తరం రాద్దామనుకోవటం మళ్ళీ ఉపసంహరించు కోవటం వాడు విన్నాడులావుంది. ఇదివరకు నీమీదున్న కసికొద్దీ అలా రాసి పారేశాడు. అనుమానం నీమీదికే వస్తుందని తెలుసు వాడికి."

ఇంతలోనే "సార్! హెడ్ గుమాస్తా పిలుస్తున్నా"రంటూ ప్యూను వచ్చాడు! ★



Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasa



మోట బావి

ఫొటో: ఎస్ గిరిధర్.

**Regd. No .M.4479.** **Andhra Patrika Illustrated Weekly.**